కోసం అనగా గంటలు, నిముషాలతో సహా తేడా రాకుండా ఉండడానికి కొన్నేళ్ళకో సారి "లుప్తమాసాన్ని" ఏర్పాటు చేసే విధానాన్ని పెట్టారు. లుప్తమాసం అంటే 1 మాసం లోపించడం అన్నమాట ! అంటే ఆ సంవత్సరంలో 11 మాసాలే ఉంటాయి. ఇది చాలా అరుదు. చాలా కాలానికి గాని రాదు. (లుప్తమాసాలు సాధారణంగా 141 సంవత్సరాలకూ లేదా ఒక్కొక్కప్పుడు 122 సంవత్సరాలకూ వస్తుంటాయి. శక సంవత్సరం 974లో లుప్తమాసం వచ్చిందనీ, మళ్లీ 1115, 1256, 1378 సంవత్సరాల్లో లుప్తమాసాలు వస్తాయనీ మన ప్రాచీన గణిత, ఖగోళ శాస్త్రవేత్త భాస్కరాచార్యుడు వ్రాశాడు. ఆ విధంగా వచ్చాయి కూడా)

హెచ్చుమంది హిందువులు పైన తెలిపిన చాంద్రసౌరమానాన్నే పాటిస్తున్నారు. ఈ పద్ధతి మనకు వేదకాలం నుండీ అమలులో ఉంది. అయితే ఈ పద్ధతిని మొట్టమొదటగా బాబిలోనియన్లు కనుగొన్నారనీ, అనంతరకాలంలో దాన్ని భారతదేశం, చైనా, గ్రీసు వారు అనుసరించారనీ కుహనా మేధావులు ఒక తప్పుడు ప్రచారం చేస్తుంటారు. మన తర్వాత బాబిలోనియన్లు తదనంతర కాలంలో అధికమాసాల్ని వాడడం కన్పిస్తుంది గాని, లుప్త మాసాల్ని వాడినట్లుగా చరిత్రలో లేదు. (మేధావులమని భ్రమించే కొంతమంది మన ప్రాచీన విజ్ఞానాన్ని, "విదేశీ విజ్ఞానంగా" చాటుతూ ఉంటారు. నేటి మన దేశ దౌర్భాగ్యం అది!)

ఖగోళ ఆధారితమైన ఈ చాంద్ర సౌరమానం అత్యంత విజ్ఞానవంతమైనది. మనం వాడుకుంటున్న పంచాంగం ఈ పద్ధతిపై ఆధారపడినదే! పూర్వీకుల విజ్ఞానంపై ఉన్న నమ్మకంతోనూ, గౌరవంతోనూ ఈ విధానాన్ని నేటికీ మనమంతా ఆచరిస్తున్నాం. ప్రపంచ దేశాలతో సహజీవన సౌలభ్యం కోసం విదేశీ క్యాలెండరును వాడినా, మన స్వంత విషయాలకు మాత్రం మన పంచాంగాన్నే వాడుకుంటున్నాం. మన పూర్వీకులు మేరుపర్వత నివాసీయులుగా (ఉత్తరధ్రువ వాసులుగా) ఉన్నప్పటి నుండీ కూడా ఈ శాస్త్రీయ అంశాల్ని అనుసరించినట్లుగా వేదాలు సాక్ష్యమిస్తున్నాయి. ఖగోళశాస్త్రంలో ప్రముఖపాత్ర వహించే "విషువత్ రేఖ" గురించి విదేశీయులకు చాలాకాలం వరకూ తెలియదు. మనకయితే విషువత్ రేఖ ప్రస్తావనలు వేదాల్లో అనేకం కన్పిస్తున్నాయి. అప్పటికి ఈ విదేశీ జాతులేవీ లేనే లేవు. అనంతరకాలంలో ఏర్పడిన ఈ జాతులు మెల్లగా కాలక్రమేణా కళ్ళు తెరిచాయి. మన ప్రాచీనుల నుండి విజ్ఞానాన్ని నేర్చిన విదేశీయులకు "విషువత్ రేఖా విషయం"- 'సిరియస్' అనే నక్షత్రంతో 'విషువత్‌రేఖ' కలిసి ఉన్నప్పటి నుండే తెలుసు. విదేశీయులు 'సిరియస్' నక్షత్రాన్ని 'కుక్క' అని అంటారు. మన

వేదాలు చెప్పిన ద్వాదశవహాలను (12 రోజులనూ) విదేశీయులు "కుక్కరోజులు" అని వ్యవహరిస్తూ సంవత్సరం లెక్కలో వాటిని విడిచిపెట్టేసేవారు. చాంద్రమాన సంవత్సరం పూర్తి అయ్యాకా, సూర్యుడు, ఈ కుక్కనక్షత్రం (సిరియస్) పై ఉన్న విషువత్ రేఖను చేరేవరకు గల 12 రోజులూ 'కుక్కరోజులని' వారి భావం.

యజ్ఞాలను చేయడం హిందువులకు అలవాటు. యజ్ఞాలతో సంవత్సరాన్ని లెక్క చూడడం వల్లనే సంవత్సరానికి "యజ్ఞం" అని మరో పేరు కూడా వచ్చింది.



## ★ హిందూ పద్ధతుల్లో సంవత్సర ఆరంభం ★

వేదకాలంలో సంవత్సర ఆరంభం లెక్కించడానికి సూర్యసహోదయాన్ని పరిగణనలోకి తీసుకునేవారు. అనగా విషువత్ రేఖపై గల ఒక ప్రముఖ నక్షత్రం సూర్యునితో కలిసి ఉదయించే రోజును సంవత్సరారంభంగా గుర్తించేవారు. మళ్ళీ సూర్యుడు అదే నక్షత్రంలో కలిసి ఉదయించేది ఆ తర్వాత సంవత్సరాదికే।

**వరాహమిహిరుని పంచాంగం :**

ఇప్పుడు మనం వాడుకుంటున్న పంచాంగాన్ని వ్రాసిన ఖగోళ శాస్త్రజ్ఞుడు వరాహమిహిరుడు. విషువత్ రేఖ మేషరాశిలో ఉండగా ఆయన పంచాంగాన్ని వ్రాశాడు. అందువల్ల మేషరాశిలో సూర్యుడు చేరి విషువత్ రేఖపై ఉదయించే రోజు సంవత్సరాది అయింది. మేషంతో రాశిచక్రాన్ని ఆరంభించి పంచాంగం వ్రాశాడాయన. ఆయన కాలంలో విషువత్ రేఖ మేషరాశిలో ఉండగా, సూర్యుడు ఆ రాశిని ప్రవేశించగానే సంవత్సరాదిని జరుపుకునేవారు. ఇలా మేషరాశిలో సూర్యుని ప్రవేశదినాన్ని సంవత్సరాదిగా పాటించడం పూర్వకాలాన ఒక ప్రముఖ సంఘటనలో కూడా మనకు కన్పిస్తుంది.**క్రీ.పూ. 3102లో శ్రీకృష్ణపరమాత్మ దేహ త్యాగం చేసిన తర్వాత ద్వాపరయుగం ముగిసి, కలియుగం ఆరంభమయింది. ఆరోజున నవగ్రహాలు ఒకే రేఖపై చేరి మేషరాశిలో ఉన్నాయట. ప్రతీ యుగ ఆరంభంలోనూ ఇలాగే ఉంటాయట. సృష్టి ఆరంభం నుండి ఇలాగే జరుగు తుందని పురాణ వచనం.** (ఈ సందర్భంలో చెప్పబడిన నవగ్రహాలు జ్యోతిష శాస్త్ర ప్రకారం మన పూర్వీకులు చెప్పే నవగ్రహాలని మనం గ్రహించాలి. (అవి సూర్యుడు, బుధుడు, శుక్రుడు, చంద్రుడు, రాహువు, కేతువు, కుజుడు, గురుడు, శని) ఈ నవగ్రహాలూ మేషరాశిలో ఒకే రేఖపై చేరినప్పుడే యుగారంభం అవుతూ

ఉంటుంది.) అలాగే, ప్రస్తుత కలియుగం కూడా ఆరంభమయింది. యుగారంభం అంటే ఎలాగూ క్రొత్త సంవత్సర ఆరంభం కూడా అదే అవుతుంది కదా! ఒక యుగానికే 'ఆది దినం" కనుక ఆరోజును 'యుగాది' అన్నారు. అదే కాలక్రమేణా 'ఉగాది'గా మారింది. అదే సంవత్సరాది. సౌరమానాన్ని పాటించే హిందువులు, అప్పటినుండీ సూర్యుడు మేషరాశిలో ప్రవేశించే రోజును సంవత్సరాదిగా పాటిస్తూ వస్తున్నారు. (పైన తెలిపిన నవగ్రహాలూ తిరిగి మేషరాశిలో ప్రవేశించేది మరో యుగారంభానికే!)

కాలక్రమేణా విషువత్ రేఖ స్థానం మారుతూ వచ్చింది. ప్రస్తుతానికి అది మీనరాశిలో ఉంది. అయితే సౌరమానాన్ని పాటించే హిందువులు (తమిళనాడు, కేరళ, ఒరిస్సా, పశ్చిమబెంగాల్ రాష్ట్రాల హిందువులు) మేషరాశిలో సూర్యుడు ప్రవేశించిన రోజునే ఇప్పటికే సంవత్సరాదిగా జరుపుకుంటున్నారు. వీరు విషువత్ చలనాన్ని పట్టించుకోలేదు. చాంద్రసౌరమానం వాడుతున్న మిగతా హిందువులంతా చంద్రుని నడకలను బట్టి చైత్రమాస శుద్ధపాడ్యమి నాడు సంవత్సరాదిని జరుపు కుంటున్నారు. (ఇదే మన ఉగాది) ఈ రెండు విధానాలూ కూడా ఖగోళశాస్త్రబద్ధమైనవే! చాంద్రసౌరమానం వాడుతున్న మనం చంద్రుని నడకలను అనుసరిస్తూ కూడా, విషువత్ రేఖ ఉన్న రాశిలోనే సూర్యుడుండగా 'సంవత్సరాది' ని జరుపుకుంటున్నాం. ఇదో విశేషం !

అయితే చాంద్రమానం, సౌరమానం, విషువత్ రేఖ అన్నివిధాల సరిపోయేలా పంచాంగ రచన జరగాలంటే మరో వరాహమిహిరుడు రావాలి. అంతవరకూ ఇప్పటి పంచాంగాలను కొనసాగించడమే!

మన దేశంలో పై విధమైన రెండు సంవత్సరాదులు ప్రస్తుతం కన్పిస్తున్నాయి.

**1)** తమిళనాడు, కేరళ, ఒరిస్సా, పశ్చిమ బెంగాల్ రాష్ట్రాల హిందువులు కాకుండా మిగతా హిందువులంతా "చాంద్రసౌరమానాన్ని" వాడుతున్నారు. వారు చంద్రుని నడకలను అనుసరించి చైత్రమాసంలోని శుద్ధపాడ్యమిని సంవత్సరాదిగా గుర్తించి, పండుగ జరుపుకుంటున్నారు. మన తెలుగువారి ఉగాది పండుగ ఇదే! (ఆ సమయానికి సూర్యుడు మీనరాశిలో ఉంటాడు)

**2)** తమిళనాడు, కేరళ, ఒరిస్సా, పశ్చిమబెంగాల్ రాష్ట్రాల హిందువులు "సౌరమానాన్ని" పాటిస్తున్నారు. వీరు మేషరాశిలో సూర్యుని ప్రవేశాన్ని సంవత్సరాదిగా గుర్తించి, పండుగ జరుపుకుంటున్నారు. ఇది వైశాఖమాసంలో వస్తుంది.

పై విధంగా హిందువులు రెండు విధాలైన సంవత్సరాదుల్ని జరుపుకుంటున్నా కూడా అందులో ఒక "ఏకత్వం" ఉంది. పై రెండు సంవత్సరాదులూ కూడా "వసంత ఋతుకాలానికి" చెందినవే! పైగా రెండింటికీ కొద్దిపాటి రోజుల తేడా మాత్రమే ఉంటుంది. రెండు సంవత్సరాదులూ కూడా ఖగోళ ప్రత్యేకతలు కలిగినవే ! ఖచ్చితమైన ఖగోళ సూత్రాల ప్రకారమే అని నిర్ణయించబడ్డాయి. ఈ రెండు రకాల సంవత్సరాదులూ కూడా కాలమానంలో సంవత్సరానికి మొదటి రోజుగా తీసుకునేందుకు చెరొక విధంగా అర్హమైనవే!

## వసంత ఋతుకాల ప్రత్యేకత :

సంవత్సరారంభానికి వసంత ఋతుకాలాన్ని తీసుకోవడంలో చాలా ప్రత్యేకతలున్నాయి. సంవత్సరంలో వసంత, గ్రీష్మ, వర్ష, శరత్, హేమంత, శిశిర ఋతువులనే 6 ఋతువులున్నాయి. వీటిలో వసంత ఋతువు అత్యంత మనోహరమైనది. ప్రకృతికి వన్నె తెచ్చి, సకల జీవుల మనసులనూ రంజింప జేసేది 'వసంత ఋతువు.' వసంత ఋతుకాలానికి ప్రపంచమంతటా ఇప్పటికీ ఒక ప్రత్యేకత ఉంది. వృక్ష సంతతి పాత ఆకులనూ, బెరళ్ళనూ హేమంత, శిశిర ఋతువుల్లో వదలిపెట్టి - వసంత ఋతువులో కొంగ్రొత్త చిగుళ్ళతో, పువ్వులతో, బెరళ్ళతో నూతన అందాలను నింపుకొంటుంది. ఎక్కడ చూసినా లోకమంతా ఒక నూతనత్వాన్ని నింపుకుని కళకళలాడుతూ కన్పిస్తుంది. భగవద్గీతలో శ్రీకృష్ణ పరమాత్మ "ఋతువులలో నేను వసంత ఋతువును" అని స్వయంగా చెప్పి, ఆ ఋతువుకు ఒక ప్రత్యేకతనిచ్చారు.



## ★ కాలమానంలో హిందూ పద్ధతులు ★

కాలమానంలో అంశాలయిన రోజు, వారం, పక్షం, కార్తె, మాసం, ఋతువు, ఆయనం, సంవత్సరం, పుష్కరం, శకం, యుగం, కల్పకం మొదలైనవన్నీ కూడా ఖగోళశాస్త్ర పరంగా ఏర్పరచుకున్న ఏకైక జాతి "హిందూజాతి". విదేశీజాతులు మాత్రం కొన్ని విషయాల్లో ఖగోళాన్ని అనుసరించడం, కొన్ని విషయాల్లో స్వంత లెక్కలు సృష్టించుకోవడం చేశాయి.

కాలమాన అంశాల్లో ముందుగా "రోజు" అనే అంశం గురించి తెలుసుకుందాం.

## (1) రోజు

అర్ధరాత్రి 12 గంటల తర్వాత నుండి మళ్ళీ అర్ధరాత్రి 12 గంటల వరకూ ఉన్న కాలాన్ని 1 రోజుగా లెక్కించడం విదేశీయుల పద్ధతి. సాధారణ వాడుకలో అయితే మనమూ దీన్నే అనుసరిస్తున్నాం. ఆలోచించి చూస్తే ఈ లెక్క అసంబద్ధంగా తోస్తుంది. ఇలా ఎందుకు చెప్పవలసి వచ్చిందో ఈ క్రింది విషయాన్ని పరిశీలిస్తే తెలుస్తుంది.

జనవరి నెలలో మొదటి రోజు (1వ తేదీ) అనగా - డిసెంబరు 31వ తేదీ అర్ధరాత్రి 12 గంటలు దాటిన తర్వాత వచ్చే రాత్రిభాగము + జనవరి 1వ తేదీ పగలు భాగము + జనవరి 1వ తేదీ సూర్యాస్తమయం నుండి అర్ధరాత్రి 12 గంటల వరకూ ఉండే రాత్రి భాగము", ఈ 3 భాగాలూ కలిపి 1 రోజుగా లెక్క. ఖగోళపరంగా చూస్తే ఇది అర్ధంలేని లెక్క. 'రోజు' అనేదానికి నిర్దిష్ట ఖగోళ ప్రత్యేకత అవసరం. ఎందుకంటే 'రోజు' అనేది కాలమానంలోని అంశం. కాలమానానికి ఖగోళమే కదా ఆధారం! 3 భాగాల్ని కలిపి ఒకరోజుగా లెక్కించే విదేశీ పద్ధతిలో 'రోజు' అనే అంశానికి నిర్దిష్ట ఖగోళమానం లేదు. "జనవరి 1వ తేదీ రాత్రి సమయం" అని చెప్పామనుకోండి. అది ఏ రాత్రి సమయం? "డిసెంబరు 31వ తేదీ అర్ధరాత్రి 12 గంటల తర్వాత వచ్చే రాత్రి భాగమా?" లేక "జనవరి 1వ తేదీ సూర్యాస్తమయం తర్వాత వచ్చే రాత్రి భాగమా?" ఇటువంటి తికమక ఉంది ఇందులో! అప్పుడు తప్పనిసరిగా టైము చెప్పవలసిన అగత్యం ఉంది.

హిందువులు అనుసరించే 'రోజు' లెక్కింపు ఖగోళశాస్త్ర రీత్యా సక్రమంగా ఉంటుంది. సూర్యోదయం నుండి మళ్ళీ సూర్యోదయం అయ్యేవరకూ 1 రోజుగా లెక్కిస్తారు హిందువులు. ప్రాచీనకాలం నుండీ కూడా మన లెక్క ఇదే! సూర్యోదయంతో మొదలై 1 పగలూ, 1 రాత్రీ కలిసి "1 రోజుగా" చెప్పడంలో ఒక నిర్దిష్టత ఉంది. (1 రాత్రిని మళ్ళీ రెండు భాగాలుగా విడగొట్టే అయోమయ పద్ధతి ఇందులో ఉండదు). ఫలానా తేదీ రాత్రి అని చెప్తే చాలు ... మరో విధంగా పొరబడే అవకాశం లేదు. రెండు సూర్యోదయాల మధ్యకాలాన్ని 1 రోజుగా గణించడం, ఒక ఖగోళ నియామన్ని పాటించడంగా ఉంది. హిందూ కాలమాన ప్రకారం ఈ విధంగా ఏర్పరచుకొన్న 'రోజు' ఖగోళ ధర్మానికి అనుగుణంగానూ, అయోమయావస్థ లేకుండా నిర్దిష్టంగానూ కూడా ఉంది. (సూర్యోదయం నుండి సూర్యోదయం వరకూ లేదా సూర్యాస్తమయం నుండి మరో సూర్యాస్తమయం

వరకూ ఉండే "కాలం" - ఎప్పుడూ ఒకే పరిమాణంలో ఉండదు. భూమి సూర్యుని చుట్టూ తిరిగే వేగం స్థిరంగా ఉండకపోవడం చేత ఈ పరిమాణం మారుతూ ఉంటుంది. అంటే సంవత్సరంలోని రోజుల పరిమాణాల్లో కొద్దికొద్ది తేడా లుంటాయి. కానీ సంవత్సరం మొత్తంమీద సరాసరి కడితే, రోజు పరిమాణం 24 గంటలుగానే ఉంటుంది. దీన్ని 'సరాసరి సౌరదినం' అంటారు. రోజుల పరిమాణాల్లో చిన్న చిన్న తేడాలున్నా రోజంటే రోజే! దీనివల్ల కాలమానంలో మార్పేమీ రాదు.)

విదేశీయులు అనుసరించే 'రోజు' లో ఒక నిర్దిష్టత ఉండదు. వారి లెక్కలో అర్ధరాత్రి 12 గంటలకు రోజు మారుతుందని అంటారు. రోజు ఆరంభానికి ఒక ఖగోళ మార్పు, ఒక ఖగోళ ప్రత్యేకతా ఉండాలి. (ఎందుకంటే కాలమానం ఖగోళం పైనే ఆధారపడింది కనుక) అర్ధరాత్రి 12 గంటల సమయంలో అంతరిక్షంలో గానీ, భూగోళంపై గానీ ఏ మార్పూ జరగదు. ఏ ప్రత్యేకతా గోచరించదు. మనం తయారుచేసుకున్న గడియారాల్లో, వాచీల్లో అంకెలు చూపే ముల్లు అర్ధరాత్రి సమయాన 12 పైకి చేరినంతలో ఏమౌతుంది? ఖగోళ పరంగా ఎక్కడా ఏ మార్పూ లేదు .... రాదు! కాలం అలా మామూలుగా గడుస్తుంది. ఖగోళ ఆధారమూ, మార్పూ, ప్రత్యేకతా ఏదీ లేకుండా అర్ధరాత్రి 12 గంటలు కొట్టేసరికి రోజు మొదలయిందంటూ లెక్కించుకోవడంలో శాస్త్రీయత లేదు. (డిసెంబరు 31వ తేదీ అర్ధరాత్రి 12 గంటలు కొట్టేసరికి 'క్రొత్త సంవత్సరం వచ్చేసిందోచ్!' అంటూ పండుగ చేసుకోవడం ఇటువంటి పిచ్చి పనే!)

హిందువులు 'రోజు' లెక్క చూడండి. "ఒక పగలు + ఒక రాత్రి =1 రోజు". ఇలా ఒక వరుసలో క్రమంగా ఉంటుంది. మరియు రోజు మారడానికి చక్కటి ఖగోళ ఆధారం ఉంది. భూమిపై వెలుగు నిండే సూర్యోదయ కార్యక్రమంతో దినారంభం అవుతుంది. అంతే గాని ... మానవ నిర్మిత గడియారం 12 గంటలు కొడితే రోజు మారుతుందా? గడియారాలు ఆగిపోతే, రోజు మారకుండా ఆగిపోతుందా? .... ఆలోచించండి.

మూడు విధాలైన లెక్కల ప్రకారం హిందువులు "రోజు" ను గుర్తిస్తూ ఉంటారు.

**1) సూర్యోదయం నుండి మరుసటి సూర్యోదయం వరకూ గల కాలాన్ని 1 రోజుగా గుర్తించే విధానం.**

## 2) తిథుల ప్రకారం గుర్తించే విధానం :

చంద్రునిలో ఒక ప్రక్క అర్ధగోళాన్నే మనం ఎప్పుడూ చూస్తుంటాం. రెండవ పైపు అర్ధగోళాన్ని మనం భూమిమీద నుండి చూడలేం. ఆత్మభ్రమణం కారణంగా రోజురోజుకూ చంద్రబింబం తరుగుతూ, అమావాస్య రోజుకు పూర్తిగా మాయమై, మళ్ళీ పెరుగుతూ పౌర్ణమినాటికి పూర్ణబింబం కన్పిస్తుంది. చాంద్రమాసాన్ని రెండు పక్షాలుగా విడదీశారు. (1) అమావాస్య నుండి పూర్ణిమ వరకూ శుక్లపక్షం. (ఈ పక్షంలో చంద్రుడు పెరుగుతాడు) (2) పూర్ణిమ నుండి అమావాస్య వరకూ కృష్ణపక్షం. (ఈ పక్షంలో చంద్రుడు తరుగుతాడు) అమావాస్య నుండి అమావాస్య వరకూ గల 30 రోజుల్లో 360 డిగ్రీల కోణం పూర్తి అవుతుంది. అంటే రోజుకు 12 డిగ్రీల బింబం తరగడం లేదా పెరగడం జరుగుతుంది. అలా ఒకరోజులో జరిగే సైజు మార్పునే “చంద్రకళ” అంటాం. అలా ఒక ‘కళ’ మార్పు జరిగితే 1 రోజుగా లెక్కిస్తారు హిందువులు. దానే “తిథి” అంటారు.

అమావాస్య నుండి సూర్యుణ్ణి దాటి చంద్రుడు 12 డిగ్రీల కోణం తిరగడానికి పట్టే కాలమే “తిథి”. ఆవిధంగా వచ్చిన మొదటి తిథికి ‘పాడ్యమి’ అని పేరు పెట్టారు మనవాళ్ళు. ప్రథమ తిథికి ‘పాడ్యమి’ అనీ, ద్వితీయ తిథికి ‘విదియ’ అనీ, తృతీయ తిథికి ‘తదియ’ అనీ , చతుర్థ తిథికి ‘చవితి’ అని పేర్లు పెట్టారు. ఈ తిథుల పేర్ల భావాలను ఒకసారి గమనించండి. చవితి తర్వాత (5వ) తిథి ‘పంచమి’. ‘పంచ’ అనగా ఐదు అని అర్థం కదా! పంచమినాడు చంద్రుడు 5 వంతులు పెరిగాడు లేదా తరిగాడు అని అర్థం. తిథులన్నీ కూడా “చంద్రుడు ఎన్ని వంతులు పెరిగాడు లేదా ఎన్ని వంతులు తరిగాడు” అనే అంశంపై ఆధారపడి ‘పేర్లు’ నిర్ణయించబడ్డాయి. షష్టి అనే తిథి ‘ఆరు’ శబ్దాన్ని ధ్వనిస్తుంది. ఆరోజున చంద్రుడు 6 వంతులు పెరిగాడు లేదా తరిగాడని తెలుస్తోంది. ఇదేవిధంగా “సప్తమి” 7 అంకెనూ, “అష్టమి” 8 అంకెనూ, “నవమి” 9 అంకెనూ, “దశమి” 10 అంకెనూ, “ఏకాదశి” (ఏక+దశ) 11నూ, “ద్వాదశి” (ద్వి+దశ) 12 నూ, “త్రయోదశి” (త్రై+దశ) 13 నూ, “చతుర్దశి (చతుర్ధ+దశ) 14 నూ ధ్వనిస్తున్నాయి చూడండి. అంటే చంద్రుడు ఆ తిథినాడు అన్నివంతులు పెరగడం లేదా తరగడం జరుగుతోందని దాని భావం. చక్కటి ఖగోళ అవగాహనతో ఈ తిథుల పేర్లు పెట్టబడ్డాయి. (14 తిథుల అనంతరం 15వ రోజున .... అది శుక్లపక్షం అయితే

పౌర్ణమి, కృష్ణపక్షమైతే అమావాస్య వస్తాయి. రోజుకు 12 డిగ్రీల మార్పుతో చంద్రుడు 15 రోజులకూ ... అనగా ఒక పక్షానికి 180 డిగ్రీలు ($180^0$) పూర్తి చేసుకుంటాడు.

## 3) నక్షత్ర ప్రకారం గుర్తించే విధానం :

సూర్యుని చుట్టూ గ్రహాలు తిరిగే మార్గంలో స్పష్టంగా కన్పించే 27 అతి పెద్ద నక్షత్రాలను (అశ్విని మొదలు రేవతి వరకూ) యుగయుగాల క్రితమే హిందువులు గుర్తించారు. చంద్రుడు రాశిచక్రం మీదుగా ఈ నక్షత్రాలకు దగ్గరగా ఉంటున్నట్లుగా ప్రయాణిస్తూ ఉంటాడు. 27 నక్షత్రాల్లో ఒక నక్షత్రం నుండి మరో నక్షత్రాన్ని చంద్రుడు చేరే కాలాన్ని "1 రోజు" గా మనవారు గుర్తిస్తారు. ఏ నక్షత్రం వద్ద చంద్రుడు ఉన్నట్లుగా కన్పిస్తే ఆ నక్షత్రం పేరుతో ఆ రోజును చెప్తారు.

**ఉదాహరణ** : చంద్రుడు 'అశ్విని' నక్షత్రం వద్ద ఉన్నరోజును 'అశ్విని' అనీ, 'హస్త' అనే నక్షత్రం వద్ద చంద్రుడు కన్పించే రోజును 'హస్త' అనీ, 'రేవతి' వద్ద ఉంటే 'రేవతి' అనీ .... అలా వ్యవహరిస్తారు.

పై మూడు లెక్కల ప్రకారం 'రోజు పరిమాణం' ఇంచుమించు సమానం గానే ఉంటుంది.

పంచాంగం ప్రకారమైనా, మామూలుగానైనా సరే సూర్యోదయంతో 'క్రొత్త రోజు' ఆరంభించే పద్ధతే ప్రామాణికమైనది. ఎందుకంటే పండితులైనా, పామరు లయినా చక్కగా గుర్తించగలిగే మార్పు "సూర్యోదయం". అందుచేతనే మన వాళ్ళు రోజు లెక్కకు "సూర్యోదయాన్నే" ప్రామాణికం చేశారు. ఇక తిథి, నక్షత్రం అనేవి చంద్రకళలను గూర్చి, చంద్రుని నడకలను గూర్చి తెలిపే ఖగోళ విజ్ఞాన విషయాలు. వీటిని ఎక్కువగా పండితులు మాత్రమే గుర్తించగలరు. పండితులు వ్రాసిన పంచాంగాల ద్వారా పామరులు వాటిని గుర్తిస్తారు. సుముహూర్తాలూ, దుర్ముహూర్తాలూ, జ్యోతిషాలూ, మత సంబంధ కార్యక్రమాలూ, జనన - ఉపనయన - వివాహ - శ్రాద్ధకర్మలు మొదలైన ఎన్నో కార్యక్రమాలకూ తిథి, నక్షత్రాలను చూసుకోవడం హిందువుల ఆచారం.

పూర్వకాలాన గ్రీకులు, రోమనులు, పర్షియన్లు "సూర్యోదయం నుండి మరో "సూర్యోదయం" వరకూ '1 రోజు'గా మనలాగే లెక్కించుకునేవారు. యూదులు,

మహమ్మదీయులు, బొహీమియన్లు, ఇటాలియన్లు మాత్రం 'సూర్యాస్తమయం' నుండి సూర్యాస్తమయం' వరకూ గల కాలాన్ని '1 రోజు' గా లెక్కించుకునేవారు.

పూర్వం భారతదేశంలో రోజును "60 ఘడియలుగా" విడదీశారు. ఒక ఘడియకు 60 విఘడియలు. 1 విఘడియకు 60 పరఘడియలు, 1 పరఘడియకు 60 సూక్ష్మఘడియలు. ఆనాటి ఖగోళశాస్త్ర లెక్క ఇలా ఉండేదట. (1సూక్ష్మ ఘడియ అనగా 0.0067 సెకను) ఘడియ ఘడియకీ గంటలు కొట్టడం రాజధానీ నగరాల్లో జరిగేది. సామాన్య ప్రజానీకం మాత్రం రోజును "8 ఝాములు" గా విభజించుకునేవారట. పగలు 4 ఝాములు, రాత్రి 4 ఝాములుగా లెక్కించుకునే వారట. మన పల్లెటూళ్ళలో ఇప్పటికీ "ఝాములు" అనే మాటను ఉపయోగిస్తుంటారు.



## ★ (2) వారం ★

ఏడు రోజుల్ని "వారం" అంటున్నాం. ప్రస్తుతం ప్రపంచమంతా వారానికి 7 రోజుల లెక్కనే వాడుతోంది. జ్యోతిషగ్రహాల పేర్లతో వారానికి 7 రోజుల పద్ధతిని మొట్టమొదట నుండీ వాడుతూ వస్తున్నారు హిందువులు. మన పంచాంగంలోని 5 అంగాలలో 'వారం' అనేది ఒక అంగం. వారానికి ఏడు రోజులుగా లెక్కించిన మొదటి వారు బాబిలోనియన్లని కుహనా మేధావుల అసత్యవాదం.

పూర్వం ఒక్కొక్క దేశంవారు ఒక్కొక్క విధంగా వారానికి వ్యవధులు ఏర్పరచుకున్నారు. పశ్చిమ ఆఫ్రికాలో కొన్ని జాతులు వారానికి 4 రోజుల వ్యవధిని పాటించేవారట. యూరప్‌లో కొన్ని చోట్ల, ఆసియాలో కొన్నిచోట్ల, మధ్య అమెరికాలోనూ వారానికి 5 రోజుల వ్యవధిని పాటించేవారట. పురాతన చాల్డియన్ క్యాలెండరులో వారానికి 6 రోజులు కన్పిస్తున్నాయి.

### 7 రోజుల వారం:

జ్యోతిష గ్రహాల పేర్లతో హిందువులు ఏర్పరచిన 7 రోజుల వారాన్నే నేడు ప్రపంచం అంతా అనుసరిస్తోంది. భూమిమీద మనుషుల జీవితాలపై ఆకాశం లోని గ్రహతారకల ప్రభావం ఉంటుందనేది "హిందువుల విశ్వాసం." దీని ఆధారంగానే గ్రహాల నడకలతో జ్యోతిషశాస్త్రం పుట్టింది. ప్రాచీన హిందూ జ్యోతిష శాస్త్రవేత్తలు "సూర్యుడు, చంద్రుడు, కుజుడు, బుధుడు, గురుడు, శుక్రుడు, శని, రాహువు , కేతువు" అనే నవగ్రహాల్ని తమ జ్యోతిషశాస్త్రంలోకి తీసుకున్నారు.

(నవగ్రహాలంటే సూర్యకుటుంబ నవగ్రహాలు వేరు, జ్యోతిషశాస్త్ర నవగ్రహాలు వేరు అని ఇక్కడ గ్రహించాలి) రాహు కేతువులు ఛాయాగ్రహాలు కావున మన పూర్వీకులు వాటిని ప్రక్కన పెట్టి మిగిలిన 7 జ్యోతిషశాస్త్ర గ్రహాల (సూర్యుడు, చంద్రుడు, కుజుడు, బుధుడు, గురుడు, శుక్రుడు, శని గ్రహాల) పేరిట 7 రోజులకూ పేర్లు నిర్ణయించి "7 రోజుల వారాన్ని" తయారుచేశారు. సూర్యుని పేరిట 'రవివారం' అంటే 'ఆది వారం' అని నామకరణం చేశారు. ('రవి' అంటే సూర్యుడనీ, 'ఆది' అంటే మొట్టమొదటి అనీ అర్థం తెలుస్తూనే ఉంది) చంద్రుణ్ణి 'సోముడు' అని కూడా అంటారు. వారంలోని 2వ రోజును ఆయన పేరిట "సోమవారం" అన్నారు. కుజగ్రహానికి "మంగళగ్రహం" అని మరో పేరుంది. అందువల్ల 3వ రోజును మంగళవారం" అన్నారు. తర్వాత బుధగ్రహం పేరిట "బుధవారం", గురుగ్రహం పేరిట "గురు వారం", శుక్రగ్రహం పేరిట "శుక్రవారం", శనిగ్రహం పేరిట "శనివారం" అని పేర్లు నిర్ణయించారు. ఇలా వారంలోని ఒక్కొక్క రోజుకూ ఒక్కొక్క జ్యోతిషగ్రహాన్ని అధిదేవతగా నిలిపి ఆయా పేర్లు పెట్టారు. (ఆయా రోజుల్లో ఆయా గ్రహాల ప్రభావం భూగోళంపై కాస్త హెచ్చుగా ఉండడం పూర్వీకులు గమనించారో ఏమో మరి! ఆవిధంగా పేర్లను నిర్ణయించారు) ఆదినుండి జ్యోతిషశాస్త్రాన్ని రూపొందిస్తూ వచ్చిన హిందువులు ఈవిధంగా 7రోజుల వారాన్ని రూపొందించగా, కొంతమంది కుహనా మేధావుల వాదం మరోలా వుంది. పాశ్చాత్య భావాలకు దాసులైన ఈ పెద్దమనుషులు "ఈ 7 రోజుల వారం మొట్టమొదటగా మెసపొటేమియాలో మొదలయిందనీ, వారంలోని 7 రోజులకూ పైవిధంగా నామకరణాలు చేసినవారు చాల్డియన్‌లనీ వాదిస్తుంటారు. ప్రథమంగా జ్యోతిషశాస్త్రాన్ని రూపొందించినవారే ఈ పద్ధతిని ఏర్పరచినట్లుగా స్పష్టమౌతోంది కదా! జ్యోతిషశాస్త్రాన్ని ప్రథమంగా రూపొందించినవారు హిందువులే! పైగా, వారం అనేది మన పంచాంగంలోని అంశం. మన పంచాంగ రచనా కాలానికి ఆ మెసపొటేమియన్లు గానీ, ఆ చాల్డియన్లు గానీ ఎక్కడున్నారని ..... ?

వారంలోని 7 రోజుల పేర్లూ హిందువుల జ్యోతిష గ్రహాలకు చెందినవి. సూర్యచంద్రులను (జ్యోతిషపరంగా) గ్రహాలలో లెక్కించే పద్ధతి కేవలం హిందువులదే! అటువంటి పద్ధతి ఏ విదేశీజాతిలోనూ లేదు. దీన్నిబట్టి కూడా వారంలోని 7 రోజుల పేర్లనూ హిందువులే నిర్ణయించారని చెప్పగలం.

జ్యోతిషశాస్త్రం కోసం సూర్య చంద్రుల్ని గ్రహాల జాబితాలో చేర్చి రాహు కేతువులతో సహా నవగ్రహారాధన చేసే ఆచారం, భూగోళాన్ని ఆ నవగ్రహాల జాబితాలో చేర్చని పద్ధతి హిందువులవే! గ్రహాలపై భక్తి, గ్రహచారం ఆధారంగా జ్యోతిషం, పురాణ పురుషులుగా గ్రహాధిపతుల కథలూ .... ఇవన్నీ హిందువులకు పురాణకాలం నుండీ ఉన్నాయి. రోజు, మాసం, కార్తె, అయనం మొదలైన ఎన్నింటికో ఖగోళ బంధాలు, ఖగోళ నామాలు ఏర్పరచారు హిందువులు. ఇవేవీ తెలియని విదేశీయులు కేవలం 'వారం' అనే అంశానికి మాత్రం ఖగోళ పరంగా పేర్లు నిర్ణయించారని చెప్పడంలో ఔచిత్యం కన్పించదు.

క్రీ.శ. **325** ముందు వరకూ రోమనులు **8** రోజుల వారాన్ని వాడినట్లుగానూ, చైనీయులు ప్రాచీనకాలంలో **10** రోజుల వారాన్ని వాడినట్లుగానూ చరిత్ర చెప్తోంది.



## ★ (3) కార్తె ★

నాటినుండి నేటి వరకూ కార్తెల లెక్కింపు హిందూ జాతికి మాత్రమే ఉంది. ఇది కూడా ఖగోళంపై ఆధారపడిన లెక్కే ! చిత్రమేమంటే - విదేశీ అనుకరణ ప్రభావంలో కొట్టుకుని పోతున్న భారతీయ విద్యావంతుల కంటే, భారతీయ పల్లెల్లోని పామరులకే ఈ లెక్క బాగా తెలుసు. వారే దీన్ని పాటిస్తున్నారు.

సూర్యుడు రాశి చక్రం మీదుగా ప్రయాణిస్తూ సుమారుగా **15** రోజుల కొక నక్షత్ర పరిధిలో ఉన్నట్లుగా కన్పిస్తాడు. ఏ నక్షత్రాలతో సూర్యుడు అలా కలిసినట్లు కన్పిస్తాడో సుమారు ఆ **15** రోజుల కాలాన్నీ - ఆ నక్షత్రం పేరుతో "కార్తె" గా చెప్తారు.

**ఉదాహరణ :** రోహిణి నక్షత్రంతో సూర్యుడు ఉండే కాలాన్ని "రోహిణీ కార్తె" అనీ, మృగశిర నక్షత్రంతో సూర్యుడు కలిసి ఉండే కాలాన్ని "మృగశిర కార్తె" అనీ, చిత్త నక్షత్రంతో కలిసి ఉంటే "చిత్త కార్తె" అనీ అంటారు. ఇలా **27** తారలతో **27** కార్తెలున్నాయి. సూర్యునికి సంబంధించిన ఖగోళాంశం 'కార్తె'.



## ★ (4) పక్షం ★

ఈ పక్షం లెక్క హిందువులతో పాటూ, పాశ్చాత్యులకూ ఉంది. అయినా హిందువులే ఈ లెక్కకు హెచ్చు ప్రాధాన్యతనిస్తారు.

పౌర్ణమినాడు పూర్ణబింబంగా కన్పించే చంద్రుడు, ఆరోజు నుండీ రోజుకు 12 డిగ్రీల చొప్పున తరిగినట్లు కన్పిస్తూ 15 రోజులకు పూర్తిగా కన్పించకుండా పోతాడు. చంద్రుడు పూర్తిగా కన్పించని ఆరోజును 'అమావాస్య' అంటాం. పౌర్ణమి నుండి అమావాస్య వరకూ గడిచిన ఆ 15 రోజులనూ "కృష్ణపక్షం" లేదా "బహుళ పక్షం" అంటాం. అమావాస్య తర్వాత నుండీ రోజుకు 12 డిగ్రీల చొప్పున చంద్రుడు మళ్ళీ పెరుగుతాడు. అలా 15 రోజులకు మళ్ళీ 'నిండు పౌర్ణమి" వస్తుంది. ఈ 15 రోజుల కాలాన్నీ "శుక్లపక్షం" లేదా "శుద్ధపక్షం" అంటాం. పక్షం అనగా 15 రోజులని భావం.

హిందువులు మంచి, చెడు ముహూర్తాలూ, పండుగలు, మరియూ మత సంబంధ విషయాల్లో ఈ లెక్కలు హెచ్చుగా వాడుకుంటారు.



## ★ (5) మాసం ★

మనదేశంలో ఎక్కువమంది హిందువులు (చాంద్రసౌరమానాన్ని వాడేవారు) చంద్రుని నడకలను బట్టి మాసాన్ని లెక్కిస్తారు. ఈ ప్రకారంగా మాసం అనేది చంద్రకళలను తెలుపుతుంది. (తిథులు గురించి వివరించిన చోట ఇదివరకే చంద్రకళలను గురించి తెలుసుకున్నారు కదా!) అమావాస్య నుండి అమావాస్యకు లేదా పౌర్ణిమ నుండి తర్వాత పౌర్ణిమకూ గల 2 పక్షాల కాలాన్ని "మాసం" గా లెక్కిస్తాం. మరోవిధంగా కూడా మనం చెప్పవచ్చు. రాశిచక్రంలో గుర్తించబడిన 27 పెద్ద నక్షత్రాల్లో ఒక్కొక్క నక్షత్రం దగ్గరగా చంద్రుడు సుమారుగా ఒక్కొక్క రోజు ఉంటూ, 1 మాసం రోజుల్లో రాశి చక్రాన్ని పూర్తిచేస్తాడు.

దక్షిణ భారతదేశంలో శుక్ల పాడ్యమి నుండి అమావాస్య వరకూ మాసాన్ని లెక్కిస్తారు. అనగా అమావాస్య మరుసటి నుండి లెక్క మొదలవుతుంది. ఉత్తర భారతదేశంవారు బహుళ పాడ్యమి (పౌర్ణమి మరునాటి) నుండి లెక్క మొదలెట్టి మళ్ళీ పౌర్ణమితో మాసాన్ని ముగిస్తారు.

పై రెండు పద్ధతుల ప్రకారం అమావాస్య, పౌర్ణమి ... దేనితో మొదలెట్టినా లెక్క మాత్రం సమానమే! రెండు విధానాలూ ఒకేరకమైన ఖగోళ ఆధారం గలవే!

విదేశీయులు మాత్రం ప్రస్తుత కాలమానంలో ఇక ఖగోళ ఆధారం ఏదీ లేకుండా 1వ తేదీ నుండి మాసాన్ని ఆరంభిస్తారు. అలాగే మాసాన్ని 30 రోజులకో, 31 రోజులకో , 28 రోజులకో ఒక్కొక్కసారి 29 రోజులకో ముగిస్తారు.

విదేశీ కాలమానం వలె కాకుండా హిందువుల కాలమానంలో ప్రతీ అంశమూ ఖచ్చితంగా ఖగోళ ఆధారంగానే ఉంటుంది. వారంలోని 7 రోజులకూ గ్రహాల పేర్లను పెట్టినట్లుగానే, మాసాలకు కూడా నక్షత్రాల పేర్లను పెట్టారు మన పూర్వీకులు. పౌర్ణమినాడు చంద్రుడు ఏ నక్షత్రం వద్ద ఉంటే ఆ మాసానికి ఆ నక్షత్రం పేరు పెట్టారు.

**ఉదాహరణ :** పున్నమి చంద్రుడు, 'చిత్త' నక్షత్రంతో ఉండే మాసానికి "చైత్రం" అనీ, 'విశాఖ' నక్షత్రంతో ఉండే మాసానికి "వైశాఖం" అనీ, ఆ తర్వాత 'జ్యేష్ఠ' నక్షత్రంతో ఉండే మాసానికి "జ్యేష్ఠం" అనీ ..... ఇలా అన్ని మాసాలకూ పేర్లను నిర్ణయించారు. (హిందువుల మాసాల పేర్లు వరుసగా చైత్రం, వైశాఖం, జ్యేష్ఠం, ఆషాఢం, శ్రావణం, భాద్రపదం, ఆశ్వయుజం, కార్తీకం, మార్గశిరం, పుష్యం, మాఘం, ఫాల్గుణం) హిందువుల మాసాల పేర్లు ఖగోళ శాస్త్ర ప్రకారం నిర్ణయించబడి ఉన్నాయి. విదేశీయులైతే తమ మాసాలకు తమకు తోచిన, నచ్చిన పేర్లను వాడుకున్నారు. (మన దేశంలో సౌరమానం వాడే కొద్దిమంది హిందువులూ సూర్యుని నడకలను బట్టి మాసాలను లెక్కించుకుంటారు. వీరి మాసాలలోని రోజుల లెక్క, చాంద్రమాసాల రోజుల లెక్కకు కాస్త భిన్నంగా ఉంటుంది. చాంద్రమాస నామాల, నక్షత్ర రాశుల సంస్కృత నామాల భ్రష్టరూపాలు వీళ్ళ మాసాల పేర్లుగా చెలామణీ అవుతున్నాయి.)

ప్రాచీన హిందువులకున్న ఖగోళ విజ్ఞానం, ఖగోళ శాస్త్రాభిమానం విదేశీయులకు లేవనేది నిస్సందేహం. అలాంటప్పుడు ఎవరో విదేశీయుల నుండి హిందువులు ఖగోళ విజ్ఞానాన్ని నేర్చారని చెప్పడం బహు విడ్డూరం.



## ★ (6) ఋతువు ★

కాలమానంలో "ఋతువు" అనేది కూడా ఖగోళ విజ్ఞానాంశమే! భూగోళం 23 1/2 డిగ్రీలు ఏటవాలుగా ఉండి సూర్యుని చుట్టూ తిరుగుతున్న కారణంగా "ఋతువులు" ఏర్పడుతున్నాయి. ఋతుచక్రం పూర్తికావడానికి పట్టేకాలం "1 సంవత్సరం". ప్రపంచంలోని అన్ని ప్రాంతాలలోనూ ఋతువులు ఒకే విధంగా లేవు. మన దేశంలో 2 నెలల కాలం ఒక ఋతువుగా, సంవత్సరానికి 6 ఋతువులున్నాయి. (చైత్ర వైశాఖ మాసాలను "వసంత ఋతువు" గానూ;

జ్యేష్ఠ, ఆషాఢ మాసాలను "గ్రీష్మ ఋతువు" గానూ ; శ్రావణ భాద్రపదాలను "వర్ష ఋతువు" గానూ; ఆశ్వయుజ కార్తీకాలను "శరదృతువు" గానూ, మార్గశిర పుష్యాలను "హేమంత ఋతువు" గానూ; మాఘ ఫాల్గుణాలను "శిశిర ఋతువు" గానూ వ్యవహరిస్తున్నాం మనం.)

శీతల దేశాల్లో సంవత్సరానికి నాలుగే ఋతువులు.

**1.** వసంతకాలం **2.** వేసవికాలం **3.** ఆకురాలు కాలం **4.** చలికాలం.

ఎస్కిమోల సంవత్సరానికి రెండే ఋతువులు.

**1.** వేసవి ఋతువు, **2.** చలి ఋతువు.

పై విధంగా భూమిపై వివిధ ప్రాంతాల్లో ఋతువులు రకరకాలుగా ఉంటాయి. (మన చలికాలం రోజుల్లో ఆస్ట్రేలియా వారికి వేసవికాలం వస్తుంది. మనకు వేసవి వస్తే వారికి చలకాలం. చూశారా ....... తమాషా!)

మనం లెక్కించుకుంటున్న **6** ఋతువుల ప్రస్తావన పురాణాల్లో అనేక చోట్ల ఉంది.



## ★ (7) అయనములు ★

హిందువులు భరతఖండ నివాసం కంటే ముందు, ఉత్తరధ్రువంలో నివసించే వారని చెప్పుకున్నాం కదా! ఉత్తరధ్రువ నివాసకాలంలోనే వేదాల రచన ఆరంభమయింది. ఆ వేదకాలం నుండీ కూడా హిందువులకు 'అయనాల' లెక్క తెలుసు.

క్రమంగా ఉత్తరధ్రువం నివాసయోగ్యం కాకుండా పోతూండడంతో హిందువులు భరతఖండానికి దిగివచ్చారు. అనంతరం చాలా కాలానికి అయనాల లెక్క విదేశీయులకు అందింది.

భూగోళ ఉత్తరధ్రువం సూర్యుని వైపు ఒదిగి తిరిగే **6** నెలల కాలం "ఉత్తరాయణం". అనంతరం దక్షిణధ్రువం సూర్యుని వైపు ఉండి తిరిగే **6** నెలల కాలం 'దక్షిణాయనం'.

ప్రతీరోజూ సూర్యుని స్థానాన్ని గమనిస్తూ ఉంటే ఉత్తరాయణ కాలంలో సూర్యుడు "ఆగ్నేయదిశ నుండి ఈశాన్యానికి; దక్షిణాయన కాలంలో ఈశాన్య దిశ నుండి ఆగ్నేయానికి" జరుగుతున్నట్లు కనిపిస్తుంది మనకు. ప్రస్తుత

కాలంలో ప్రపంచమంతటికీ ఈ విషయం తెలుసు. అయితే విదేశాల్లో కేవలం శాస్త్రవేత్తలకూ కొంతమంది విద్యావంతులకూ మాత్రమే ఈ లెక్క తెలుసు. హిందువులకయితే ఈ అయనాల లెక్క వారి జీవన స్రవంతిలో బాగా కలసి పోయింది. అయనాల లెక్కను తెలిపే పండుగలు, పుణ్యకాలాలూ, వేద పురాణేతిహాస కాలాల నుండీ ఆచరణలో ఉన్నాయి. మన దేశ పండిత పామరులంతా వీటిని ఇప్పటికీ అనుసరిస్తూ ఆచరిస్తున్నారు.



## ★ (8) సంవత్సరం ★

ఉగాది నుండి మొదలై మళ్ళీ ఉగాది వరకూ (అనగా వసంత ఋతువు నుండి శిశిర ఋతువు వరకూ) ఉండే కాలాన్ని 'సంవత్సరం' గా లెక్కిస్తున్నాం మనం.

ఖగోళపరంగా సంవత్సరాన్ని లెక్కించడానికి హిందువులు అనుసరిస్తున్న "సౌరమాన మరియు చాంద్రసౌరమాన పద్ధతులను" గురించి ఈ పుస్తకంలో ఇంతకుముందే చదివారు కదా! (సంవత్సర ఆరంభ విషయంలో కూడా హిందువులు చూపిస్తున్న విజ్ఞతను కూడా ఇంతకు ముందే చదివారు) హిందువులు 60 సంవత్సరాల చక్రాన్ని వాడుతూ వస్తున్నారు. "ప్రభవ" నామ సంవత్సరంతో మొదలయ్యే సంవత్సర చక్రం 60వ నామమైన 'అక్షయ'తో ముగుస్తుంది. ఈ సంవత్సర చక్రంలోని 60 సంవత్సరాలనూ పూర్తిగా చూసిన వ్యక్తులు షష్ఠిపూర్తి మహోత్సవాన్ని జరుపుకుంటారు. షష్ఠి అనగా 60. వాళ్ళు దానిని పూర్తి చేసారన్నమాట. షష్ఠిపూర్తి మహోత్సవంలో వున్న ఈ అంతరార్థం నేటికీ చాలామందికి తెలియదు.

విదేశీయుల సంవత్సరం, సంవత్సరారంభం, ముగింపులకు ఖగోళ శాస్త్ర ఆధారం ఏదీ లేదని కూడా ఇంతకు ముందే తెలుసుకున్నాం.



## ★ (9) పుష్కరం ★

ఖగోళ శాస్త్రరీత్యా ఒక కాలమాన అంశం ఇది. పుష్కరం లెక్కను ఆచరిస్తున్నది కేవలం హిందువులే !

గురు గ్రహానికి 'బృహస్పతి' అనే పేరు కూడా ఉంది. ఆ బృహస్పతి నడకలపై ఆధారపడినదే పుష్కరమానం. గురుగ్రహం (బృహస్పతి) ఒక్కొక్క నక్షత్రరాశిలో సుమారుగా ఒక్కొక్క సంవత్సరం ఉంటుంది. (అనగా ఉన్నట్లు కన్పిస్తుంది) ఆ విధంగా మేషరాశితో రాశిచక్ర ప్రయాణం మొదలెట్టి, మీన రాశితో తన సంచారం ముగించడానికి గురుగ్రహానికి 12 సంవత్సరాల కాలం పడుతుంది. ఈ 12 సంవత్సరాల కాలాన్నే "పుష్కరం" అంటారు. ఈ లెక్క పామరులతో సహా అందరికీ తెలిసేలా పుష్కర కుంభమేళాలు, పుష్కర పుణ్యకాలాలు, పుష్కర పుణ్యతీర్థ కాలాలూ అంటూ అనేక పండుగలు, పర్వ దినాలూ ఏర్పరచారు హిందువులు. (దీని పూర్తి వివరాలు మా "హిందూ పండుగల్లో సైన్స్" పుస్తకంలో చూడవచ్చు.)



## ★ (10) బృహత్కాల మానం ★

హిందువుల కాలమానంలో ఇంకా బృహత్తర అంశాలెన్నో ఉన్నాయి. 60 పేర్లు గల 60 సంవత్సరాల చక్రం వాడుకలో ఉంది మనకు. దశాబ్దాలు, శతాబ్దాలు, శకాలు కాకుండా "యుగాల లెక్క" కూడా ఉంది మనకు. (శకాల లెక్కింపు గురించి ఇదే పుస్తకంలో ఇంతకు ముందు తెలుసుకున్నాం. యుగాల లెక్కింపు గురించి ఇప్పుడు తెలుసుకుందాం.)

### హిందువుల యుగాల లెక్క

హిందూ జ్యోతిష శాస్త్రంలో సూర్యుడు, చంద్రుడు, బుధుడు, శుక్రుడు, కుజుడు, గురుడు, శని, రాహువు, కేతువు అనే 9 గ్రహాలున్నాయి కదా! ఈ నవగ్రహాలూ, వాటి కక్ష్యా దూరబిందువులు (APOGEES), వాటి కక్ష్యలు సూర్యుని మార్గాన్ని ఖండించే బిందువులు (NODES) ..... ఇవన్నీ "అశ్వని" నక్షత్రంతో కలిసి ఉన్న కాలం నుండి "కాలం లెక్కింపు" మొదలయిందని హిందువులు చెప్తారు. ఈ నవగ్రహాల చలన బిందువులన్నీ తెలుసు కనక, వాటి ప్రదక్షిణ కాలములన్నీ పూర్ణ సంఖ్యల్లో ఉండడానికి ఎంత వ్యవధి కావాలో కనిష్ఠ సామాన్య గుణిజాన్ని లెక్కవేసి, ఆ కాలవ్యవధిని '1 కల్పకం' అన్నారు హిందువులు. అది 432 కోట్ల సౌర సంవత్సరాలకు సమానం. అంటే 1 కల్పక ప్రారంభంలో నవగ్రహాలన్నీ అశ్వనీ నక్షత్రంతో కలిసి ఉన్నట్లయితే, మళ్ళీ

మరో కల్పక ఆరంభంలో కూడా అలాగే ఉంటాయన్న మాట. ఈ కల్పకంలో **1000** వ వంతును (అంటే **43,20,000** సంవత్సరాలను) **"1** మహాయుగం" అన్నారు. మళ్ళీ దాన్ని **4** యుగాలుగా విభజించారు. (కృత, త్రేతా, ద్వాపర, కలి యుగాలు అవే!) **1** మహాయుగంలో **10**వ వంతును **(4,32,000** సంవత్సరాలను) "కలియుగం" అన్నారు. కలియుగానికి రెట్టింపు కాలాన్ని "ద్వాపరయుగం" గానూ, కలియుగానికి **3** రెట్లు కాలాన్ని "త్రేతాయుగం" గానూ, నాలుగురెట్లు కాలాన్ని "కృతయుగం" గానూ చెప్పారు. కృత, త్రేతా, ద్వాపర, కలియుగాలు నాలుగూ కలిపి **'1** మహాయుగం' అన్నమాట. సుమారు **71** మహాయుగాల కాలాన్ని **"1** మన్వంతరం" అంటారు. అలాంటి **14** మన్వంతరాలు కలిస్తే **'1** కల్పకం'. బ్రహ్మ దేవునికి (అనగా ప్రకృతికి) ఒక కల్పకకాలం **'1** పగలు' గానూ, మరో కల్పకకాలం **'1** రాత్రి' గానూ లెక్కఅట! ఒక కల్పకం అనగా **432** కోట్ల సంవత్సరాలని చెప్పుకున్నాం కదా! ప్రకృతి ఉద్భవించడంతో ప్రారంభమైన కల్పకం, మళ్ళీ ప్రకృతి పూర్తిగా అంతరించడంతో **(432** కోట్ల సంవత్సరాలకు) ముగుస్తుంది. బ్రహ్మ దేవునికి **1** పగలు అంటే అదే! ప్రకృతి ఒక గ్రహంపై అంతరించి, మళ్ళీ మరో గ్రహంపై ఉద్భవించడానికి మధ్య నుండే కాలం "మరో కల్పకం". దాన్నే "బ్రహ్మ దేవుని రాత్రి" అంటారు. **పురాణాలు చెప్తున్న ఈ కల్పకాల సిద్ధాంతం, ఆధునిక సైన్స్ విషయాలకు అనుకూలంగానే ఉంది. ఇంతటి బృహత్తర కాలమానాన్ని భూమిపై మరోజాతి ఏదీ చెప్పలేక పోయింది. అదే హిందూజాతి ఘనత !**

భూమిమీద సృష్టి ప్రారంభమై ఇప్పటికి సుమారు 2 వందల కోట్ల సంవత్సరాలు గడిచినట్లుగా ఆధునిక శాస్త్రవేత్తలు చెప్తున్నారు. హిందువులు పైవిధంగా చెప్పిన బృహత్తర కాలమానం ప్రకారం (మన పురాణాల ఆధారంగా) లెక్కవేసి చూడగా భూమిమీద సృష్టి ఆరంభమై 2వందల కోట్ల సంవత్సరాలైనట్లుగా తేలింది. హిందువులు తమ బృహత్తర కాలమానంతో చెప్పిన విషయాలు, ఆధునిక శాస్త్రవేత్తల అంచనాతో సరిపోవడం నిజంగా మనకు గర్వకారణం. (ఇందుకు సంబంధించిన లెక్కల వివరణ "పురాణాల్లో సైన్స్" అనే మా గ్రంథంలో ఇచ్చాం, చూడండి)

హిందువుల బృహత్తర కాలమానం ఏమాత్రం కల్పితమైనదీ, ఊహాజనిత మైనదీ కాదని, అది శాస్త్రీయంగా నేడు నిరూపించబడుతోందనీ గ్రహించండి. ఇంత గొప్ప కాలమానం, విజ్ఞానం - పండిత పామరులందరికీ అందేవిధంగా ఎన్నో ఆచార వ్యవహారాల్నీ, పండుగల్నీ తమ సంస్కృతిలో విలీనం చేసుకున్న ఏకైక జాతి "ఘనత వహించిన మన హిందూ జాతి!"

ఘనమైన విజ్ఞతతో కూడిన హిందూ సంస్కృతిని వదులుకుంటూ, ఈ మధ్య విదేశీ సంస్కృతి పట్ల మోజు పెంచుకుంటున్నారు మనవాళ్ళు. ఇదెలా ఉందంటే .... **"మన చేతిలో ఉన్న వెండిగిన్నెలోని పాయసాన్ని వదలి, పరాయి చిప్పలోని పాచికూడు కోసం ప్రాకులాడినట్లుగా" ఉంది.**

భారతీయ సోదర సోదరీమణులకు ఒక విజ్ఞాపన! మన సంస్కృతీ విజ్ఞతను శాస్త్రీయంగా తెలుసుకోండి. ఆచరించండి. సైన్స్ పేరిట, నాస్తికత్వం పేరిట, నవనాగరికం పేరిట - అజ్ఞానంతో స్వసంస్కృతికి దూరం కాకండి. విజ్ఞానంతో మెలగండి. మన సంస్కృతిలోని ఉత్కృష్టతను పాశ్చాత్యులే గుర్తిస్తున్న ఈ తరుణంలో మన కర్తవ్యం ఏమిటో ఆలోచించండి. 'వ్యర్థమైన అనుకరణలు వద్దు. స్వసంస్కృతి మనకెంతో ముద్దు.'



## ★ వివిధ దేశాల్లో క్యాలెండరు పుట్టుక ★

కాలాన్ని లెక్కించుకోవడం కోసం చేసుకున్న ఏర్పాటే "క్యాలెండర్".

### హిందువుల క్యాలెండర్ :

**పూర్తిగా ఖగోళశాస్త్రంపై ఆధారపడిన కాలమానాన్ని ఏర్పరచుకున్న ఏకైక జాతి 'హిందూ జాతి'. హిందువుల క్యాలెండరంటే "పంచాంగమే!" ఇది ఖగోళ శాస్త్రబద్ధమై ఖచ్చితంగా ఉంటుంది.** తిథి, వారం, నక్షత్రం, యోగం, కరణం అనే అంగాలతో రూపొందించబడిన పంచాంగం, హిందువుల కాల మానానికి ఒక ఆలంబన. హిందూ పంచాంగం పుట్టుక ఎప్పుడనేది తేల్చే సమర్థత నేడెవ్వరికీ లేదు. అంతటి ప్రాచీన చరిత్ర దానికి ఉంది. తికమకలు పడకుండా కాలాన్ని లెక్కించగల ఖగోళ సామర్థ్యం పూర్వ హిందువులకుంది. అందువల్ల క్యాలెండరు తయారీ అనేది వారికి సమస్య కాలేదు. **(ఈ ఆధునిక కాలంలో కూడా మన పంచాంగానికి ఎదురులేదు. విదేశీ శాస్త్రవేత్తలు టెలిస్కోపులతో తంటాలుపడి తెలుసుకునే ఎన్నో ఖగోళ విషయాల్ని, మన పంచాంగకర్తలు తమ లెక్కలతో చిటికెలో తెలుసుకుంటున్నారు. భవిష్యత్తులోని వాతావరణ విషయాల్నీ, గ్రహణాలు మొదలైన అంశాల్నీ ఖచ్చితంగా చెప్పగలుగుతున్నారు.)**

## విదేశీ జాతుల తిప్పలు:

కాలాన్ని లెక్కించడం కోసం క్యాలెండరును తయారుచేసుకోవడంలో విదేశీ జాతులు చాలా ఇబ్బందులు పడ్డాయి. ప్రాచీన విదేశీ జాతుల క్యాలెండర్ల విషయాలు కొన్నింటిని క్లుప్తంగా తెలుసుకుందాం.

### 1. ఈజిప్షియన్ క్యాలెండరు:

విదేశీ క్యాలెండర్లలో ప్రాచీనమైనదిగా దీన్ని చెప్పుకోవచ్చు. వీరిది సౌర మానం. క్రీ.పూ. **4700-4500** సంవత్సరాల మధ్య కాలంలో సంవత్సరానికి **360** రోజులని ఈజిప్షువారు లెక్కించేవారు. అనంతర కాలంలో **365** రోజులుగా దాన్ని సరిదిద్దుకుని ఆచరించారు. నాలుగు సంవత్సరాల కొక రోజును అదనంగా లెక్కించుకోవాలని వీరికి కొన్ని శతాబ్దాల పాటు తెలియలేదు. ఆఖరికి క్రీ.పూ. **238**వ సంవత్సరంలో **3**వ టాలెమీ యూర్గెటిస్ అనే రాజు కాలంలో నాలుగు సంవత్సరాలకొక రోజును అదనంగా లెక్కించాలంటూ (లీపు సంవత్సర విధానంపై) ఒక శాసనం వెలువడింది. అప్పటికీ ఆ శాసనాన్ని మత గురువు లెవరూ లెక్కచేయక పోవడంతో అది ఆచరణలోకి మాత్రం రాలేదు.

### 2. బాబిలోనియన్ క్యాలెండరు:

క్రీస్తు పూర్వపు ఈ బాబిలోనియన్లు నివసించినది ఇప్పటి ఇరాక్ ప్రాంతం. బాబిలోనియన్లు క్రీ.పూ. **540** లో సంవత్సరానికి గల సరైన కాలవ్యవధిని ఇంచు మించులో తెలుసుకోగలిగారు. హిందువుల అనంతరం రాశిచక్రాన్ని గురించి తెలుసుకున్నది వీరే! (హిందువులకు ఋగ్వేద కాలానికే రాశిచక్రం గురించి తెలుసు. ప్రపంచంలో ఆది గ్రంథం "ఋగ్వేదమని" విదేశీ మేధావులు కూడా అంగీకరించారు. ఋగ్వేదంలో మూడొంతుల విజ్ఞానం ఖగోళమే! ప్రాచీన ఖగోళ పరిజ్ఞానంలో హిందువులకు ఏ జాతీ సాటి కాబోదని ఇందుమూలంగా మనం చెప్పగలం) క్రీ.పూ.**3** వేల సంవత్సరాల కాలంలో బాబిలోనియన్లు చాంద్ర మానాన్ని ఉపయోగించేవారు. తర్వాత ఈజిప్ట్‌వారి సంపర్కంతో 'సౌరమానాన్ని' తెలుసుకున్నారు. ఆ తర్వాత చాలాకాలానికి హిందువుల వలె 'చాంద్ర సౌరమానం' వాడడం నేర్చుకున్నారు.

## 3. గ్రీకు క్యాలెండరు:

గణిత, ఖగోళ, జంతు, వృక్ష, రాజకీయ, అర్థశాస్త్రాల్లోనూ, శిల్పకళ, చిత్ర లేఖనాల్లోనూ హిందువుల నుండి విజ్ఞానాన్ని పొందారు గ్రీకులు. (అయితే ఈ శాస్త్రాలన్నింటిలోనూ గ్రీకులే ప్రథములని వాదించే కుహనా మేధావులు లేక పోలేదు.) క్రీ.పూ.400-300 సంవత్సరాల మధ్యకాలంలో సంవత్సరం, నెల కాల వ్యవధుల్ని తెలుసుకున్నారు గ్రీకులు. చాంద్రసౌరమానాన్ని వాడడం నేర్చుకున్నారు. నాలుగు సంవత్సరాలకొక రోజును అదనంగా లెక్కించుకుని ఈజిప్షియన్ కాలెండరును చాలాకాలం పాటు వీరు వాడుకున్నారు. సూర్యాస్తమయంతో రోజును మొదలుపెట్టేవారు గ్రీకులు. శకముల లెక్కను హిందువుల నుండి నేర్చుకున్నారు.

## 4. చైనా క్యాలెండరు:

ఈజిప్షియన్ క్యాలెండరు తర్వాత పురాతనమైనదిగా ఈ చైనాక్యాలెండరును చెప్పుకోవచ్చు. ఋతుచక్రాన్ని తెలియజేసే చైనా పంచాంగం క్రీ.పూ. 2 వేల సంవత్సరాల కాలంలో తయారైంది. హిందూ దేశంలో ఉన్నట్లు చైనా దేశంలో కూడా సౌర పంచాంగం, చాంద్రసౌర పంచాంగం రెండూ వేర్వేరు చోట్ల అమలులో ఉండేవి. హిందువులు వాడే 60 సంవత్సరాల చక్రాన్నే చైనీయులూ వాడేవారు. జూలియన్ క్యాలెండరులో వలె లీపు సంవత్సరాలు వీరికి ఉన్నాయి.

## 5. మయ క్యాలెండరు :

దక్షిణ అమెరికాలోని మయ జాతివారు క్రీ.పూ.500 సంవత్సర ప్రాంతాల వారు. రోజు, మాసం, సంవత్సర కాలపరిమాణాన్ని ఇంచుమించుగా బాగానే లెక్కించేవారు వీరు. వీరికి 'శకాలు' కూడా తెలుసు.

## 6. యూదుల క్యాలెండరు :

బాబిలోనియా చేరుకున్న యూదుజాతి బాబిలోనియన్ల క్యాలెండరునే అనుసరించింది. క్రీ.పూ. 3761 వ సంవత్సరం అక్టోబరు 7వ తేదీ ఆదివారం రాత్రి 11 గంటల 11 నిమిషాలకు వీళ్ళ దేవుడు "ప్రపంచసృష్టి" చేశాడని వీరి నమ్మకం. అదే వారి శకారంభం.

## 7. ముస్లిం క్యాలెండరు:

అరేబియా ప్రాంత అరబ్బులు రూపొందించిన క్యాలెండరు ఇది. వీరిది చాంద్రమానం. కేవలం చాంద్రమానంపై ఆధారపడి రూపొందించిన ఈ క్యాలెండరు, మతసంబంధ ప్రాముఖ్యతనే కలిగి ఉండేది.



## ★ ప్రస్తుత ప్రపంచ క్యాలెండరు గత చరిత్ర ★

### క్యాలెండర్ అనే పేరిలా వచ్చింది?

క్రీస్తు కాలానికి కొన్ని శతాబ్దాల ముందు (క్రీ.పూ.లో) గ్రీకులు "పాడ్యమి చంద్రుడు" కనపడగానే నెల ప్రారంభమయిందని లెక్కించుకునేవారు. నెల ప్రారంభమయిందంటూ ముందుగా రోమ్ నగరంలో ప్రజలకు పిలుపునిచ్చే వారట. లాటిన్ భాషలో "క్యాలర్" అంటే "పిలుపు నివ్వడం" అని అర్థం. నెల ప్రారంభం పిలుపు రాగానే, ప్రజలు తమ నిత్య జీవన ఆర్థిక పద్దులన్నీ సరి చూసుకునేవారు. ఇటువంటి పద్దుపుస్తకాన్ని "క్యాలెండర్" అని వ్యవహరించే వారట. ఆ పేరే - తేదీలు, వారాలు, నెలలను సూచించే పట్టికకు స్థిరపడి "క్యాలెండర్" అనే మాట ప్రపంచవ్యాప్తమయింది.

ప్రస్తుతం మనం వాడుతున్న "గ్రిగోరియన్ క్యాలెండరు" (జనవరి టు డిసెంబరు క్యాలెండరు) చరిత్రను తెలుసుకుందాం. ఇందుకోసం ముందుగా 'రోమన్ క్యాలెండరు' గురించి చెప్పుకోవలసి ఉంటుంది.



## ★ రోమన్ క్యాలెండరు ★

క్రీ.పూ. 8వ శతాబ్దిలో రోమనులు 10 నెలలుండే సంవత్సరం గల ఒక క్యాలెండరును వాడేవారట. అదే "రోమన్ క్యాలెండరు". రోమన్ సామ్రాజ్య స్థాపకుడైన "రోమ్యులస్" ఆ క్యాలెండరును ప్రారంభించాడు. లాటిన్ భాషా క్యాలెండరు అది! అందులోని 10 నెలల పేర్లు ఈ క్రింది విధంగా ఉండేవి.

| | |
|---|---|
| 1. మార్సియస్ | 6. సెక్సిలిస్ |
| 2. ఏప్రిలిస్ | 7. సెప్టెంబర్ |
| 3. మాయియస్ | 8. అక్టోబర్ |
| 4. జూనియస్ | 9. నవంబర్ |
| 5. క్వింటిలిస్ | 10. డిసెంబర్ |

చరిత్రకారులు తెలుసుకున్నంత మేరకు ఆనాటికి ఆ పేర్లు అలా ఉన్నాయి. పై పేర్లలో కొన్ని కాలక్రమేణా రకరకాలుగా మారి ప్రస్తుత రీతిలోకి రావడం జరిగింది. దీన్ని బట్టి ఆలోచించి చూడగా, పైన తెలుపబడిన నెలల పేర్లు చరిత్రకు అందని కాలంలో మరో విధంగా ఉండి, క్రీ.పూ. 8వ శతాబ్ది నాటికి ఈవిధంగా వ్యవహరించబడేవని భావించవచ్చు. సెప్టెంబరు, అక్టోబరు, నవంబరు, డిసెంబరు నెలల పేర్లు మాత్రం అప్పటినుండి ఇప్పటివరకూ ఏ మాత్రం మార్పు లేకుండా మిగిలాయి. ఆ నాలుగు పేర్లూ సంస్కృత నామాలకు భ్రష్టరూపాలుగా తెలియవస్తున్నాయి. (అంటే అచ్చమైన సంస్కృత నామాలు కాలక్రమేణా ప్రజల ఉచ్చారణలో మార్పుకు లోనైనవని అర్థం). ఈ నాలుగు నామాల ద్వారా మనకర్థమయ్యే విషయాలు చాలా ఉన్నాయి. అవి ముందు పేజీల్లో తెలుసుకుందాం.

క్రీ.పూ. 715-673 ల మధ్య "న్యూమా పాంపీలియస్" అనే రోమన్ చక్రవర్తి "జాన్యువారియస్," "ఫిబ్రువారియస్" అనే రెండు నెలలను రోమన్ క్యాలెండరుకు కలిపి, 12 నెలల సంవత్సరాన్ని ప్రవేశపెట్టాడు. ఇలా రూపొందించ బడిన రోమన్ క్యాలెండరులో సంవత్సరానికి 355 రోజులు ఉండేవి. అవి ఈ క్రింది విధంగా సర్దబడ్డాయి.

| | | | |
|---|---|---|---|
| 1. మార్సియస్ | - 31 రోజులు | 7. సెప్టెంబర్ | - 29 రోజులు |
| 2. ఏప్రిలిస్ | - 29 రోజులు | 8. అక్టోబర్ | - 31 రోజులు |
| 3. మాయియస్ | - 31 రోజులు | 9. నవంబర్ | - 29 రోజులు |
| 4. జూనియస్ | - 29 రోజులు | 10. డిసెంబర్ | - 29 రోజులు |
| 5. క్వింటిలిస్ | - 31 రోజులు | 11. జాన్యువారియస్ | - 29 రోజులు |
| 6. సెక్సిలిస్ | - 29 రోజులు | 12. ఫిబ్రువారియస్ | - 28 రోజులు |

ఈవిధంగా రోమనులు 'నెలకు' రోజుల పరిధిని 29 గా గాని, 31 గా గాని నిర్ణయించారు. నెలకు 30 రోజులుగా ఎక్కడా నిర్ణయించలేదు. దీనికో కారణం ఉంది. సరిసంఖ్యల్ని అశుభ సూచకాలుగా భావించే ఆచారం వారికుండేదట. (30 అనేది సరిసంఖ్యే కదా మరి!) అయితే ఫిబ్రువారియస్ నెలకు మాత్రం 28 రోజులుగా నిర్ణయించారు. అందుకు ఒక ప్రత్యేక కారణం ఉంది. "ఫిబ్రువారియస్ నెల" క్షుద్ర దేవతలకూ, ప్రేతాత్మలకూ అంకితమైన నెల అని వారి నమ్మకం అట! అందువల్ల దానికి సరి సంఖ్యలో రోజులున్నా పరవాలేదట!! చూశారా... వారి అవివేకత!!

## పైన తెలిపిన 12 నెలలకూ ఆ పేర్లెలా వచ్చాయి?

1. **మార్సియస్:** 'మార్స్' అనగా కుజగ్రహం. ఆ గ్రహం పేరిట ఈ నెలకు 'మార్సియస్' అని నామకరణం చేశారట.

2. **ఏప్రిలిస్ :** 'ఏపేరియో' అనే లాటిన్ పదానికి "విచ్చుకొనుట" అని అర్థం. హెచ్చుగా పువ్వులు ఈ నెలలో విచ్చుకుంటాయి కనుక, ఈ నెలకు 'ఏప్రిలిస్' అని పేరు పెట్టారట.

3. **మాయియస్:** రోమనులు "మేయ" అని పిలిచే ఒక నక్షత్రం సూర్యునితో సహా ఈ నెలలో ఉదయిస్తుంది. కనుక ఈ నెలకు ఈ పేరొచ్చింది.

4. **జూనియస్ :** రోమను రాజవంశావళిలోని "జూనియస్" అనే రాజు పేరుతో ఈ నామం వచ్చింది.

5. **క్వింటిలిస్ :** 'క్వింటిలిస్' అనే లాటిన్ పదానికి 5వది అని అర్థమట. అందువల్ల ఈ 5వ నెలకు ఈ పేరు పెట్టారు.

6. **సెక్స్టిలిస్ :** 'సెక్స్టిలిస్' అనే లాటిన్ పదానికి 6వది అని అర్థం. అందువల్ల 6వ నెలకు ఈ పేరు పెట్టారు.

వీటి తర్వాత 7, 8, 9, 10 నెలలైన సెప్టెంబర్, అక్టోబర్, నవంబర్, డిసెంబర్‌లకు "మరుగుపడిన ఒక చరిత్ర" ఉంది. నేటి కుహనా మేధావులు భ్రమ పడుతున్నట్లుగా ఈ నాలుగు పేర్లూ లాటిన్ భాషకు చెందినవి కావు. మన

సంస్కృత నామాలకు భ్రష్టరూపాలవి! (అంటే క్రమంగా ఉచ్చారణలో మారిన పేర్లు అవి) ఈ నాలుగు నెలల పేర్లూ లాటిన్ భాషకు చెందినవయితే - సెప్టెంబర్‌కు "సెప్టెలిస్" అనో; అక్టోబర్‌కు 'ఆక్టోలిస్' అనో ; నవంబర్‌కు "నవోలిస్" డిసెంబర్‌కు "డిశంలిస్" అనో .... లేదా అటువంటి ఉచ్చారణలతో మరో రూపంలో ఉండేవి. "సెప్టెంబర్, అక్టోబర్, నవంబర్, డిసెంబర్" అనే పేర్లు సంస్కృత భాష ద్వారా చక్కని ఖగోళ అంతరార్థాన్ని ధ్వనిస్తున్న పదాలుగా స్పష్టంగా తెలుస్తున్నాయి. సంస్కృత భాష "మనది". అలాంటప్పుడు అవి విదేశీ పదాలెలా అవుతాయి? హిందువుల నుండి విదేశీయులు నేర్చుకున్న పదాలవి. ఇంత ఖచ్చితంగా ఎందుకు చెప్తున్నామో, వివరిస్తాం చూడండి.

రాశి చక్రం మీదుగా చంద్రుడు ఒకసారి ఆ వృత్తాన్ని పూర్తిచేస్తూ, ఆకాశమంతా ఒక చుట్టు చుట్టివస్తే 1 నెల కదా! ఒకసారి చంద్రుడు ఆ విధంగా ఆకాశ ప్రదక్షిణ చేస్తే "ఏక+అంబర్ = ఏకాంబర్" అని లెక్కించవచ్చు. ('అంబరం' అంటే సంస్కృతంలో ఆకాశం అని అర్థం). ఆవిధంగా చంద్రుడు 7వ సారి ఆకాశ ప్రదక్షిణ చేస్తుంటే "సప్త+అంబర్ = సప్తాంబర్ (సెప్టెంబర్)" అనీ, 8వ సారి ప్రదక్షిణ చేస్తుంటే 'అష్ట+అంబర్ = అష్టాంబర్ (అక్టోబర్)" అనీ, 9వ సారి ప్రదక్షిణ చేస్తుంటే "నవ+అంబర్ = నవంబర్" అనీ, 10వ సారి ప్రదక్షిణ చేస్తుంటే "దశ+అంబర్= దశంబర్ (డిసెంబర్)" అనీ వ్యవహరించడం జరిగేదన్న మాట. అలా 12సార్లు చంద్రుడు ఆకాశ ప్రదక్షిణల్ని పూర్తి చేస్తే '1 సంవత్సరం' అవుతుంది. సంవత్సరంలో చంద్రుడు ఎన్నోసారి అంబర (ఆకాశ) ప్రదక్షిణ చేస్తుంటే, ఆ సంఖ్యతో మాసాల పేర్లను పూర్వ హిందువులు నిర్ణయించినట్లుగా మనం గమనించవచ్చు. ఈవిధమైన 12 నెలల సంస్కృత నామాల్నీ హిందువుల నుండి గ్రహించిన గ్రీకువారు, కాలక్రమేణా కొన్ని నామాల్ని తమకు నచ్చినట్లుగా మార్చేసుకోగా "సెప్టెంబర్, అక్టోబర్, నవంబర్, డిసెంబర్"ల నామాలు మాత్రం ఇప్పటికీ అలా మిగిలి ఉన్నాయి. (కాలమానంలోని అంశాలకు ఖగోళ పరంగా నామకరణాలు చేయడం హిందువుల అలవాటు మరియు ప్రత్యేకత! ఏ రాజుగారి పేరుతోనో లేదా ఆయన ఉంపుడుగత్తె పేరుతోనో నామకరణాలు చేసే విదేశీ పద్ధతి - హిందువులకు ఏనాడూ లేదు)

మాసాల పేర్లు మాత్రమే కాక, మార్చినెల కాలంతో సంవత్సరాన్ని ఆరంభించుకునే పద్ధతిని కూడా గ్రీకులు హిందువుల నుండే నేర్చుకున్నారు.

కనుకనే సెప్టెంబర్ (సప్త+అంబర్) ను 7వ నెలగానూ, అక్టోబర్ (అష్ట+అంబర్) ను 8వ నెలగానూ, నవంబర్ (నవ+అంబర్) ను 9వ నెలగానూ, డిసెంబర్ (దశ + అంబర్) ను 10 వ నెలగానూ చెప్పుకొచ్చారు.

ఇంతవరకూ ఇచ్చిన వివరణ ద్వారా సెప్టెంబర్, అక్టోబర్, నవంబర్, డిసెంబర్ నెలల పేర్లలోని అంతరార్థాన్ని తెలుసుకున్నారు. (ఇక్కడితో 10 నెలల పేర్లెలా వచ్చిందీ అర్థమైంది కదా!) ఈసారి 11, 12 నెలల గురించి తెలుసుకుందాం.

**11. జాన్యువారియస్ :** 'జానుస్' అనే రెండు తలల గ్రీకు దేవత పేరుతో ఈ నెలకు "జాన్యువారియస్" అని పేరొచ్చింది.

**12. ఫిబ్రువారియస్ :** "ఫిబ్రువా" అనబడే రోమను మతసంబంధ పండుగ, ఆరోజుల్లో వచ్చేది కనుక - ఆ మాసానికి "ఫిబ్రువారియస్" అని పేరొచ్చింది.

'న్యూమా పాంపీలియస్' ప్రవేశపెట్టిన ఈ క్యాలెండరులో 355 రోజులే ఉండేవని తెలుసుకున్నాం. ఈ క్యాలెండరు సూర్యగమనాన్ని అనుసరించి ఉండకపోవడం వల్ల ఒక అధికమాసాన్ని నేర్చుకోవలసిన అవసరం కలిగింది. ఆ అధికమాసం ఎప్పుడు పెట్టుకోవాలో తెలియక, ఆనాటివారు అనేక తికమకలు పడేవారట.

క్రీ.పూ. 46వ సంవత్సరంలో "జూలియస్ సీజర్" అనే ప్రఖ్యాత రోమన్ చక్రవర్తి భ్రష్టు పట్టిన "రోమను క్యాలెండరు"ను "సోసీజెనిస్" అనే గ్రీకు ఖగోళ శాస్త్రవేత్త చేత చాలా వరకూ సవరింపజేశాడట. అప్పటినుండీ రోమన్ క్యాలెండరు 'జూలియస్ సీజరు' పేరు మీదుగా "జూలియన్ క్యాలెండరు" అని పిలువబడింది.



## ★ జూలియన్ క్యాలెండరు ★

ఈ జూలియన్ క్యాలెండరులో సంవత్సరానికి 365 రోజులుండాలని నిర్ణయించాడు సోసీజెనిస్. అతడు 365 రోజుల్నీ 12 నెలలకూ ఈ క్రింది విధంగా సరిపెట్టాడు.

| | | | |
|---|---|---|---|
| 1. మార్సియస్ - (31 రోజులు) | 7. సెప్టెంబర్ - (31 రోజులు) |
| 2. ఏప్రిలిస్ - (30 రోజులు) | 8. అక్టోబర్ - (30 రోజులు) |
| 3. మాయియస్ - (31 రోజులు) | 9. నవంబర్ - (31 రోజులు) |
| 4. జూనియస్ - (30 రోజులు) | 10. డిసెంబర్ - (30 రోజులు) |
| 5. క్వింటిలిస్ - (31 రోజులు) | 11. జాన్యువారియస్ - (31 రోజులు) |
| 6. సెక్టిలిస్ - (30 రోజులు) | 12. ఫిబ్రువారియస్ - (29 రోజులు) |

తనపేరు మీదుగా ఒకనెల ఉంటే బావుంటుందని జూలియస్ సీజర్‌గారు సరదా పడ్డారట. చక్రవర్తి తలచుకుంటే జరగనిదేముంది? క్రీ.పూ. **44**వ సంవత్సరంలో "క్వింటిలిస్" అనే నెల పేరు, జూలియస్ సీజర్ పేరు మీదుగా 'జూలియస్" అని మార్చబడింది. అప్పటినుండీ ఈ రోమన్ క్యాలెండరును "జూలియన్ క్యాలెండర్" అనేవారు. "జూలియన్" అనే నెల పేరు కాలగమనాన ఆంగ్లేయుల ఉచ్ఛారణలో 'జూలై' గా మారింది.

జూలియస్ సీజర్ హత్య చేయబడిన అనంతరం అతని అన్నకొడుకు 'అగస్టస్' రాజ్యానికి వచ్చాడు. అతనికి కూడా తనపేరు మీదుగా 1 నెల ఉండాలని ముచ్చట కలిగిందట. క్రీ.పూ. 8వ సంవత్సరంలో "సెక్టిలిస్" అనే నెల పేరును తొలగించి 'అగస్టిస్' అనే పేరు పెట్టించాడు. "జూలియస్ సీజర్ పేరున ఉన్న 'జూలియన్' నెలకు 31 రోజులుండగా తన పేరున ఉన్న నెలకు "30 రోజులే ఉండడం" అగస్టస్‌కు నచ్చలేదట. తన నెలకు కూడా 31 రోజులే ఉండాలని పట్టుపట్టాడట. దాంతో మతాధికారులు సమావేశమై చివరినెల అయిన ఫిబ్రువారియస్‌లో ఒకరోజును తగ్గించి, దాన్ని 'అగస్టిస్' నెలకు కలిపారట. (ఫిబ్రువారియస్ అనే పదం అనంతర కాలాన 'ఫిబ్రవరి' గా మారింది. నేటి ఫిబ్రవరి నెలకు 28 రోజులుండడం ఇలా జరిగిందన్న మాట!) అప్పుడు జూలియన్ (జూలై), అగస్టిస్ (ఆగస్ట్), సెప్టెంబరు నెలలు మూడింటికీ వరుసగా 31 రోజులు రావడం జరిగింది. దీన్ని గమనించిన అగస్టస్ చక్రవర్తి సెప్టెంబరు నెలకు 30 రోజులుగానూ, అక్టోబరు నెలకు 31 రోజులుగానూ, నవంబరు నెలకు 30 రోజులుగానూ, డిసెంబరు నెలకు 31 రోజులుగానూ మార్చాడట.

అప్పుడు జూలియన్ క్యాలెండర్ ఈ విధంగా తయారయింది.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. మార్సియస్ | - | (31 రోజులు) | 7. సెప్టెంబర్ | - | (30 రోజులు) |
| 2. ఏప్రిలిస్ | - | (30 రోజులు) | 8. అక్టోబర్ | - | (31 రోజులు) |
| 3. మాయియస్ | - | (31 రోజులు) | 9. నవంబర్ | - | (30 రోజులు) |
| 4. జూనియస్ | - | (30 రోజులు) | 10. డిసెంబర్ | - | (31 రోజులు) |
| 5. జూలియస్ | - | (31 రోజులు) | 11. జాన్యువారియస్ | - | (31 రోజులు) |
| 6. అగస్టిస్ | - | (31 రోజులు) | 12. ఫిబ్రువారియస్ | - | (28 రోజులు) |

సంవత్సరానికి రోజులు 365 కాదనీ, 365 1/4 రోజులనీ అనంతర కాలంలో గ్రహించారు రోమనులు. 1 సంవత్సరానికి 1/4 రోజును తక్కువగా లెక్కిస్తున్న కారణంగా 4 సంవత్సరాల కొకసారి 1 రోజు (1/4 × 4 =1 రోజు) ను అదనంగా లెక్కించసాగారు. ఆరోజును ఫిబ్రువారియస్ (ఫిబ్రవరి) నెలాఖరున చేర్చేవారు. అయితే వారు దాన్ని 29వ తేదీ అనేవారు కాదట. 28వ తేదీనే "రెట్టింపు రోజు" గా చూసుకునేవారట. (ఫిబ్రువారియస్ 28వ తేదీ ఆదివారమైతే, ఆ తర్వాత లెక్కించే అదనపు రోజును కూడా ఆదివారంగానే పరిగణించేవారట.)

## లీపు సంవత్సరం అనే మాట ఎలా వచ్చింది?

నాలుగు సంవత్సరాల కొక అదనపు రోజును చేర్చుకునే పద్ధతిని నేడు వాడుతున్నాం కదా! ఆ అదనపురోజును చేర్చుకున్న సంవత్సరాన్ని "లీప్ సంవత్సరం" అంటున్నాం. అయితే ఆనాటి రోమన్‌ల వలె కాకుండా ఆ అదనపు రోజును ఫిబ్రవరి 29వ తేదీగా లెక్కించుకుంటున్నాం. జూలియన్ క్యాలెండరును క్రైస్తవులు స్వీకరించిన తర్వాత వచ్చిన మార్పు ఇది! ఆంగ్లంలో "లీప్" (Leap) అనగా "గెంతుట" లేదా "దుముకుట" అని అర్థం. "అదనపు రోజును కలిగిన సంవత్సరం", 4 సంవత్సరాల కొకసారి "గెంతుతున్నట్లుగా" వస్తుంది కనుక, దాన్ని "లీప్ సంవత్సరం" (Leap year) అన్నారు. అదీ సంగతి! (4చే నిశ్శేషంగా భాగించబడే సంవత్సరాలన్నీ "జూలియన్ క్యాలెండరు" లో లీపు సంవత్సరాలే! నేటి "గ్రిగోరియన్ కాలెండరు" లో అయితే మాత్రం ఇందులో చిన్న సవరణ ఉంది. దాన్ని తర్వాత పేజీల్లో తెలుసుకుంటారు)

క్రీ.శ. 4వ శతాబ్దారంభంలో ఈ జూలియన్ క్యాలెండరును క్రైస్తవులు గ్రహించారు. కాన్‌స్టాన్‌టైన్ అనే రోమన్ చక్రవర్తి క్రైస్తవ మతం పుచ్చుకున్నాడు.

ఆ తర్వాత క్రమంగా ప్రపంచ దేశాల్లో అనేక చోట్ల "జూలియన్ క్యాలెండరు" అమలులో కొచ్చింది.

## జూలియన్ క్యాలెండరులో కనుగొనబడిన లోపం:

జూలియన్ క్యాలెండరు సంవత్సర వ్యవధి **365.25** రోజులు. అయితే ఖగోళ శాస్త్ర ప్రకారం యథార్థ సంవత్సర పరిధి **365.242216** రోజులు. అంటే సంవత్సరానికి యథార్థంగా **365.242216** రోజులు కాగా, జూలియన్ క్యాలెండరులో సంవత్సరానికి **365.25** రోజులుగా లెక్కించబడేవి. అంటే సంవత్సరానికి **0.007784** రోజును ఎక్కువగా లెక్కించుకోవడం జరిగేదన్న మాట. **0.007784** రోజు అనగా "**11** నిమిషాల **12.5** సెకన్లు." (ఈ విధంగా యథార్థ సంవత్సర పరిధికంటే, జూలియన్ సంవత్సర పరిధి **11** నిముషాల **12.5** సెకన్లు ఎక్కువగా ఉండేదన్న మాట) సంవత్సరానికి **11** నిముషాల **12.5** సెకన్ల చొప్పున ఎక్కువగా లెక్కించుకుంటూ పోతే **128.4** సంవత్సరాలకు ఆ తేడా '**1** రోజు' అవుతుంది. ఆ తేడాను అలా వదిలేస్తే భవిష్య కాలాన లెక్కింపులో చాలా పెద్ద తేడా వచ్చేస్తుందనీ, దాన్ని వెంటనే సవరించే ప్రయత్నాలు చేయాలనీ కాన్‌స్టాన్‌టైన్ చక్రవర్తి క్రైస్తవ మతాధికారులకు సూచించాడట. జూలియన్ క్యాలెండరులోని ఈ లోపాన్ని సవరించడానికి క్రీ.శ. **325** నుండీ ఎందరో క్రైస్తవ మతాధికారులు ప్రయత్నాల్ని మొదలెట్టారట. ఆ ప్రయత్నాలు అలా కొనసాగుతూండగా శతాబ్దాలు గడిచాయి. ఆమధ్య కాలంలో జూలియన్ క్యాలెండరు మరికొన్ని మార్పులకు లోనయింది. ప్రజల ఉచ్చారణలో కొన్ని నెలల పేర్లు కొద్దికొద్దిగా మారడం జరిగింది. మార్సియస్ "మార్చి" గానూ, ఏప్రిలిస్ "ఏప్రిల్" గానూ, మాయియస్ "మే" గానూ, జూనియస్ "జూన్" గానూ, జూలియస్ "జూలై" గానూ, అగస్టిస్ "ఆగస్టు" గానూ, జాన్యువారియస్ "జనవరి" గానూ, ఫిబ్రువారియస్ "ఫిబ్రవరి" గానూ మారాయి.

మన సంస్కృత నామాలైన సెప్టెంబర్, అక్టోబర్, నవంబర్, డిసెంబర్ లు మాత్రం ఆనాటినుండి ఈ నాటివరకూ అలాగే ఉన్నాయి. **11, 12** నెలలుగా ఉన్న జనవరి, ఫిబ్రవరి నెలలు "**1, 2** నెలల స్థానాలను" ఆక్రమించి సంవత్సర ఆరంభానికి చేరుకున్నాయి. (జనవరి **1**వ నెలగా సంవత్సరారంభానికి ఎలా చేరుకున్నదీ తర్వాత పేజీల్లో వివరించాం)

**పై మార్పుల అనంతరం జూలియన్ క్యాలెండరు క్రీ.శ. 16వ శతాబ్దికి ఈ క్రింది విధంగా తయారయింది.**

| | | | | | |
|---|---|---|---|---|---|
| **1.** | జనవరి | - **(31 రోజులు)** | **7.** | జూలై | - **(31 రోజులు)** |
| **2.** | ఫిబ్రవరి | - **(28 రోజులు)** | **8.** | ఆగస్ట్ | - **(31 రోజులు)** |
| **3.** | మార్చి | - **(31 రోజులు)** | **9.** | సెప్టెంబర్ | - **(30 రోజులు)** |
| **4.** | ఏప్రిల్ | - **(30 రోజులు)** | **10.** | అక్టోబర్ | - **(31 రోజులు)** |
| **5.** | మే | - **(31 రోజులు)** | **11.** | నవంబరు | - **(30 రోజులు)** |
| **6.** | జూన్ | - **(30 రోజులు)** | **12.** | డిసెంబరు | - **(31 రోజులు)** |

"జనవరి నెలను సంవత్సరానికి మొదటి నెలగా నిర్ణయించడం అనేది" కాలమానంలో విదేశీయులు అనుసరించిన విచ్చలవిడితనానికి ప్రతీక! ఇలా చేయడం వల్ల "సప్త+అంబర్" గా 7వ నెలను సూచించే సెప్టెంబరును "9వ నెలగా" లెక్కించవలసి వస్తోంది. "అష్ట+అంబర్" గా 8వ నెలను సూచించే అక్టోబరును" 10వ నెలగా లెక్కించవలసి వస్తోంది. అలాగే 9వ నెలను సూచించే నవంబరు (నవ+అంబర్) 11వ నెలగానూ, 10వ నెలను సూచించే డిసెంబర్ (దశ+అంబర్) 12వ నెలగానూ మారిపోయాయి. సంవత్సరానికి మొదటి నెలగా "మార్చి" ఉండేదనే యథార్థాన్ని సెప్టెంబర్, అక్టోబర్, నవంబర్, డిసెంబర్ లు చాటి చెప్తున్నాయి నేటికీ!

జూలియన్ క్యాలెండరు సంవత్సరంలోని 11 నిముషాల 12.5 సెకన్ల హెచ్చు సమయాన్ని సవరించడానికి క్రీ.శ 16వ శతాబ్ది వరకూ ప్రయత్నాలు కొనసాగుతూనే వచ్చాయి. క్రీ. శ. 1572లో 8వ పోప్ "గ్రిగరీ" ఈ లోపాన్ని సవరించే పనిని "లూయీ గెలీలియో, ఎంటోనియో లీలియో" అనే ఇద్దరు ఖగోళ శాస్త్రవేత్తలకు అప్పగించాడు. వారు వసంత విషువత్‌ను పరిశీలించి, "అప్పటికి నడుస్తున్న జూలియన్ క్యాలెండరులో నుండి 10 రోజుల్ని వదిలేసి లెక్కిస్తూ, వసంత విషువత్‌ను మార్చి 21వ తేదీకి తీసుకు రావాలనీ, ఆ తర్వాత నుండీ 400 లచే నిశ్శేషంగా భాగించబడని శతాబ్ద సంఖ్యల్ని లీపు సంవత్సరాలుగా పరిగణించకూడదనీ" ప్రతిపాదించారు. ఈ ప్రతిపాదనను గురించి వివరంగా తెలుసుకుందాం.

శతాబ్ద సంఖ్యా సంవత్సరాలన్నీ - అనగా క్రీ.శ. 1600, క్రీ.శ.1700, క్రీ.శ.1800, క్రీ.శ.1900, క్రీ.శ.2000, క్రీ.శ.2100 ..... మొదలైనవన్నీ 4 చే నిశ్శేషంగా భాగించబడతాయి కాబట్టి (జూలియన్ క్యాలెండరు ప్రకారం) అవన్నీ నిజానికి లీపు సంవత్సరాలే! అయితే పైన తెలుపబడిన సంస్కరణల ప్రకారం ఈ పద్ధతిలో కాస్త మార్పు వచ్చింది. 400 లచే నిశ్శేషంగా "భాగించబడే" శతాబ్ద సంఖ్యా సంవత్సరాలన్నీ .... అనగా క్రీ.శ.1600, క్రీ.శ.2000, క్రీ.శ. 2400 మొదలైనవన్నీ లీపు సంవత్సరాలే! కానీ 400 లచే నిశ్శేషంగా "భాగించబడని" శతాబ్ద సంఖ్యా సంవత్సరాలు మాత్రం .... అనగా క్రీ.శ. 1700, క్రీ.శ.1800, క్రీ.శ. 1900, క్రీ.శ .2100 మొదలైనవి లీపు సంవత్సరాలు కావు.

"సంవత్సరానికి 11 నిముషాల 12.5 సెకన్ల చొప్పున అప్పటివరకూ (క్రీ.శ. 1580 ప్రాంతాల వరకూ) వచ్చిన హెచ్చు సమయాన్ని తగ్గించడానికి, 10 రోజుల్ని లెక్కించకుండా వదిలేయాలనీ; భవిష్యత్తులో రాబోయే హెచ్చు కాల పరిమాణాన్ని సవరించడానికి, 400 లచే నిశ్శేషంగా భాగించబడని శతాబ్ద సంఖ్యా సంవత్సరాల్ని 'లీపు సంవత్సరాలుగా లెక్కించవద్దనీ" - పై సంస్కరణల లోని సారాంశం.

పోప్ గ్రిగరీ ఈ సంస్కరణల గురించి క్రీ.శ. 1577 లో యూరప్‌లోని కేథలిక్ రాజులకూ, వివిధ యూనివర్శిటీలకూ ఉత్తరాలు వ్రాశాడట. ఆ రోజుల్లో అది పెద్ద సంచలనాన్ని సృష్టించింది. ఏది ఏమయితేనేం, పలువురు అంగీకరించిన మీదట పోప్ గ్రిగరీ క్రీ.శ. 1581 లో ఈ విధమైన ఆజ్ఞ జారీ చేశాడట; "రాబోయే క్రీ.శ. 1582 వ సంవత్సరం అక్టోబరు నెలలో 5 నుండి 14 వరకూ గల తేదీలను లెక్కించకుండా వదిలెయ్యాలి. రాబోయే 10 సంవత్సరాల పాటు క్యాలెండరు ప్రింటు చేసే పనిని ఎవరు పడితే వారు చేయకూడదు. పోప్ నియమించిన సంస్థలే ఆ పని చెయ్యాలి. అలా చేస్తే తప్పుడు లెక్కలకు అవకాశం ఉండదు. ఇందులకు భిన్నంగా ఎవరైనా ప్రవర్తిస్తే వాళ్ళు వెలివేయబడతారు."



## ★ గ్రిగోరియన్ క్యాలెండర్‌గా మారిన "జూలియన్ క్యాలెండర్ ★

పై విధంగా జూలియన్ క్యాలెండరును సంస్కరించినవాడు "పోప్ గ్రిగరీ". 10 రోజుల్ని లెక్కించకుండా వదలివెయ్యడం, లీపు సంవత్సరం లెక్కింపులో ప్రవేశపెట్టిన మార్పు .... ఈ రెండూ అతను చేయించిన ముఖ్య సంస్కరణలు, ఇలా సంస్కరించబడిన "జూలియన్ క్యాలెండరు" అప్పటినుండి "గ్రిగరీ" పేరు మీద "గ్రిగోరియన్ క్యాలెండర్" అని పిలువబడుతూ వస్తోంది.



## ★ గ్రిగోరియన్ క్యాలెండరు ★

నేడు మనం అనుసరిస్తున్న ఆంగ్ల సంవత్సర క్యాలెండరు ఇదే! అంతే కాదు. నేడు ప్రపంచ వ్యాప్తంగా అనుసరించబడుతున్న 'ఉమ్మడి క్యాలెండరు' కూడా ఇదే! ఉమ్మడి క్యాలెండరుగా ప్రపంచమంతా ఒకేసారి దీన్ని ఆమోదించలేదు.

### గ్రిగోరియన్ క్యాలెండరు ఆమోదించబడిన విధానం :-

గ్రిగరీ, క్రైస్తవ మత ఉన్నతాధికారి అయిన 'పోప్' కనుక - అతని ఆజ్ఞలకు లోబడి గ్రిగోరియన్ క్యాలెండరును కేథలిక్ దేశాలు (ఫ్రాన్స్, ఇటలీ, పోలండ్, పోర్చుగల్, స్పెయిన్ దేశాలు) ముందుగా అంగీకరించాయి. ప్రొటస్టెంట్లు, తూర్పు అర్థడాక్స్ దేశాలూ పోప్ ఆజ్ఞలను అంగీకరించలేదు. ఆ తర్వాత కాలంలో మెల్ల మెల్లగా ఒక్కొక్క దేశం ఈ గ్రిగోరియన్ క్యాలెండరును ఆమోదిస్తూ వచ్చాయి. క్రీ.శ. 1699 లో జర్మనీ, క్రీ.శ. 1752 లో ఇంగ్లాండ్, క్రీ.శ. 1873 లో జపాన్, క్రీ.శ. 1912 లో చైనా, క్రీ. శ. 1916 లో బల్గేరియా, క్రీ.శ. 1918 లో రష్యా దేశాలు ఈ క్యాలెండరును అంగీకరించి, అమలులో పెట్టుకున్నాయి. (17, 18 శతాబ్దాల్లో ఆంగ్లేయులు, తమ పరిపాలన క్రింద ఉన్న ప్రపంచ వివిధ ప్రాంతాల్లో గ్రిగోరియన్ క్యాలెండరును ప్రవేశపెట్టారు. మన దేశానికి ఈ క్యాలెండరు ఈవిధంగానే వచ్చింది.) క్రమంగా అలా గ్రిగోరియన్ క్యాలెండరు "ప్రపంచపు ఉమ్మడి క్యాలెండరు" గా మారింది.



## ★ ప్రస్తుతం మనం వాడుతున్న గ్రిగోరియన్ క్యాలెండరులోని లోపాలు ★

మనం వాడుతున్న జనవరి టు డిసెంబరు క్యాలెండరు (అంటే గ్రిగోరియన్ క్యాలెండరు) సులభతరంగానూ, నిర్దిష్టంగానూ ఉన్నట్లు మనలో చాలామంది భావిస్తుంటారు. ప్రస్తుతం ప్రపంచమంతా ఉమ్మడిగా అనుసరిస్తున్న ఈ గ్రిగోరియన్ క్యాలెండరు పూర్తి సవ్యంగానూ, హేతుబద్ధంగానూ లేదు నిజానికి !

క్రీ.శ.1582 లో "పోప్ గ్రిగరీ" సవరింపు చేయించినా కూడా, ఇప్పటికింకా ఈ క్యాలెండరులో కాస్త దోషం మిగిలే ఉంది. యథార్థ సంవత్సర పరిధి కంటే, మనం వాడుతున్న సంవత్సర పరిధి **24.6** సెకన్లు ఎక్కువగా ఉంది. అంటే ప్రతి సంవత్సరానికీ **24.6** సెకన్ల కాలాన్ని మనం అధికంగా లెక్కించుకుంటున్నాం. **3,513** సంవత్సరాలు గడిచేసరికి ఈ దోషం "ఒక రోజుకు" సమానమౌతుంది. ఆనాటికి **1** రోజును తగ్గించుకోవడం ద్వారా ఈ క్యాలెండరును సంస్కరించు కోవలసి ఉంటుంది. (భవిష్యత్తులోని క్రీ.శ. **4000** సంవత్సరాన్ని "లీపు సంవత్సరంగా లెక్కించకుండా" వదిలేస్తే సరిపోతుందని ప్రముఖ ఖగోళ శాస్త్రవేత్త జాన్ హెర్షెల్ సూచించాడట. ఆ తర్వాత కూడా **4000** లచే నిశ్శేషంగా భాగించబడే సంవత్సరాల్ని లీపు సంవత్సరాలుగా లెక్కించకుండా వదిలేస్తే - ఈ దోషం **20** వేల సంవత్సరాలకు "**1** రోజు" అవుతుంది. అంతవరకూ ఎందుకు గానీ, ఈలోగా క్యాలెండరు విషయంలో ఏం క్రొత్త మార్పులు రానున్నాయో, వేచి చూద్దాం! అదీకాక భూమి తనచుట్టూ తాను తిరిగే సమయంగానీ, సూర్యుని చుట్టూ తిరిగి రావడానికి పట్టే సమయం గానీ ఎల్లకాలం స్థిరంగా ఉండడం లేదు. స్వల్ప మార్పులుంటున్నాయి. అందువల్ల ఖచ్చితమైన రీతిలో వేలవేల సంవత్సరాలకు సరిపోయే క్యాలెండరును తయారు చేయడం చాలా కష్టం. ఎప్పటి కవసరమైన మార్పుల్ని, ఆ కాలంవారు అప్పుడు చేసుకుంటూనే ఉంటారు. )

ఈ గ్రిగోరియన్ క్యాలెండరు సంవత్సరంలోని నెలలకు రోజులు ఒక పద్ధతిలో లేవు. కొన్ని నెలలు **30** రోజుల్నీ, కొన్ని నెలలు **31** రోజుల్నీ, ఒక నెల **28** రోజుల్నీ, అదే నెల ఒకోసారి **29** రోజుల్ని కలిగి ఉంటాయి. "నెలలకు పెట్టిన పేర్లు" ఖగోళ ఆధారంగా గానీ, లేదా ఒక నిర్ణీత పద్ధతి ద్వారా గానీ పెట్టినవి

కావు. ఎవరికి వారే తమకు తోచినట్టు మార్పు చేయగా, అస్తవ్యస్థంగా అయోమయ క్రమంలో స్థిరపడిన పేర్లు అవి.

నెలకు ఎన్ని వారాలంటే చెప్పడం కష్టం. ఒకసారి **4** వారాలనీ, మరోసారి **4** 1/7 వారాలనీ, ఇంకోసారి **4** 2/7 వారాలనీ, కొన్నిసార్లు **4** 3/7 వారాలనీ చెప్ప వలసి వస్తుంది. సంవత్సరానికి వారాల్ని కూడా ఖచ్చితంగా చెప్పలేం. **52** 1/7 వారాలు అనిగానీ, లేదా **52** 2/7 వారాలు అని గానీ చెప్పవలసి వస్తుంది. ఈ భిన్నాల వల్ల సంవత్సరం ముగింపు, ఆరంభ కాలాల్ని ఖచ్చితంగా చెప్పడంలో ఇబ్బంది ఉంది.

వారంలోని 7 రోజుల్లో ఏ రోజుతో నైనా సంవత్సరారంభం కావచ్చు. ఎప్పుడూ ఒకేరోజు రాదు. అలాగే నెల అనేది కూడా వారంలోని ఏ రోజుతో నైనా మొదలు కావచ్చు. ఎప్పుడూ అదే రోజుతో మొదలయ్యే అవకాశం లేదు. వారానికున్న 7 రోజులూ, అన్ని నెలల్లోనూ ఒకే సంఖ్యలో రావు. కనీసం ఏదో ఒకరోజును తీసుకున్నా కూడా, అది అన్ని నెలల్లోనూ ఒకే సంఖ్యలో రాదు.

సంవత్సరాన్ని **4** పాదాలుగా విడదీద్దామంటే - అవి సమాన భాగాలుగా కాకుండా **90,91,92,92** రోజులుగా ఉంటాయి. అదే లీపు సంవత్సరంలో అయితే **91,91,92,92** రోజులుగా ఉంటాయి. నెలలో పనిదినాల (Working days) సంఖ్య స్థిరంగా ఉండక, నెలనెలకూ మారుతూ ఉంటాయి. ఆ సంఖ్య సాధారణంగా **24** రోజుల నుండి **27** రోజుల వరకూ ఉంటాయి.

మామూలు నిత్యావసరాలకయితే ఈ క్యాలెండరు బాగానే నడచిపోతుంది. ఈనాటి వేగవంతమైన మరియూ విస్తృతమైన ప్రపంచానికి తగ్గట్టుగా ఈ క్యాలెండరు లేదు. నెలవారీగా లేదా అర్ధ, పావు సంవత్సరాల వారీగా ఉత్పత్తి ఏవిధంగా ఉండాలో, వ్యాపారాభివృద్ధి ఏ రేటున జరగాలో ముందుగానే పథకాలు వేసుకోడానికీ, పథకాల ప్రకారం నడుస్తున్నదీ లేనిదీ సరి చూసుకోడానికీ - అస్తవ్యస్థ వ్యవధులు గల ఈ నెలలు దోహదపడవు. కోర్టులు, స్కూళ్ళు మొదలగు సంస్థలు తెరచి ఉండే రోజులు, మూసి ఉండే రోజులు ఒక నిర్దిష్ట పద్ధతిలో ఉంచడానికి లేకుండా 'తేదీలు, వారాలు, సెలవు దినాలు' చిక్కులు తెచ్చిపెడుతూనే ఉంటాయి.

గ్రిగోరియన్ క్యాలెండరులోని పై లోపాలను సవరించడం అవసరమని ప్రపంచం ఏనాడో గుర్తించింది. అవసరమైన సూచనలు చేయడానికి "నానాజాతి

సమితి" ఒక కమిటీని ఏర్పరచింది. ఆ కమిటీ 185 రకాల ప్లానులను పరిశీలించి క్రీ.శ. 1926 లో ఒక రిపోర్ట్ తయారుచేసిందట. ప్రస్తుతం వాడుకలో ఉన్న నెలలను తొలగించేవిధంగా వేర్వేరు పథకాలు రెండింటిని ఆ రిపోర్టులో ప్రతిపాదించింది. అయితే ఆ రిపోర్టు ఇప్పటివరకూ భద్రంగా అలాగే ఉండిపోయింది. దాని ప్రకారం ఎటువంటి సంస్కరణా నేటికీ జరగలేదు. ఈ గ్రిగోరియన్ క్యాలెండరు ఇలాగే నడుస్తూ ఉంది. భవిష్యత్తులో ఏం జరుగుతుందో వేచి చూద్దాం.



## ★ సంవత్సర ఆరంభంగా "జనవరి 1" ఎలా వచ్చింది? ★

హైందవులు మేరుపర్వత వాసీయులుగా (ఉత్తర ధ్రువ వాసులుగా) ఉన్నప్పటి నుండీ విషువత్ రేఖా విజ్ఞానాన్ని కలిగి ఉన్నట్లుగా ఋగ్వేదం సాక్ష్యమిస్తోంది. (ప్రపంచాన ఋగ్వేదమే ఆది గ్రంథమని, జగమంతా అంగీకరించింది.) మన ఋషీశ్వరులు ఋగ్వేదాన్ని రూపొందిస్తున్న సమయంలో భూగోళంపై ఇంకా విదేశీజాతులు ఉద్భవించనేలేదు. అనంతర కాలంలో విదేశీజాతులు భూగోళంపై అక్కడక్కడా ఏర్పడి, కళ్ళు తెరువనారంభించాయి. ఆ జాతులు అనేక విజ్ఞానాంశాల్ని హిందువుల నుండే క్రమంగా నేర్చుకున్నాయి. విషువత్ రేఖా విజ్ఞానాన్ని రోమన్లు క్రీస్తుపూర్వమే మననుండి గ్రహించారు. వసంత విషువత్ మార్చినెలలో ఉండడంవలన మనవాళ్ళు మార్చినెలలో సంవత్సరారంభాన్ని పాటించేవారు. ఆవిధంగా సంవత్సరంలోని 12 నెలలకూ 12 సంస్కృత నామాలు ఆనాడు మనకు ఉండే ఉంటాయి. ఆ 12 సంస్కృత నామాల్నీ మన నుండి రోమన్లు గ్రహించి ఉంటారు. వారు ఆ నామాల్ని క్రమంగా లాటిన్ భాషలోకి మార్చుకుంటూ రాగా "సెప్టెంబర్, అక్టోబర్, నవంబర్, డిసెంబర్" లు మాత్రం ఆ ప్రకారంగా మిగిలి ఉన్నాయి.

అనంతర కాలంలో హిందువులు చంద్రుని నడకల ఆధారంగా (వసంత ఋతుకాలపు మార్చినెల ప్రాంతం నుండే ఆరంభించి) "చైత్రం నుండి ఫాల్గుణం వరకూ 12 నెలల పేర్లనూ ఏర్పరచుకున్నారు. వసంత ఋతుకాలంలోని చైత్ర మాస శుద్ధపాడ్యమి నాడు హెచ్చుమంది హిందువులు ఉగాదిగా సంవత్సరాదిని పాటిస్తున్నారు. మిగతా హిందువులు మేషరాశిలో సూర్యుని ప్రవేశాన్ని సంవత్సరాదిగా పాటిస్తున్నారు. ఈ రెండురకాల సంవత్సరాదులకూ కొద్దిరోజుల తేడా ఉంటుంది. ఈ రెండు సంవత్సరాదులూ కూడా ఎప్పుడూ ఒకే తేదీన రావు.

(మన ఉగాది పండుగ మార్చి, ఏప్రిల్ నెలల్లోని తేదీలకు మారుతూండడం మనకు అనుభవమే కదా!)

వసంత విషువత్ మార్చినెలలో ఉండడం వల్ల పాశ్చాత్యులు కూడా ప్రాచీన హిందువుల వలె మార్చినెల నుండి సంవత్సరారంభాన్ని పాటించేవారు. గ్రిగోరియన్ క్యాలెండరును అనుసరించక పూర్వం ఫ్రాన్స్‌లో క్రీ.శ.1582 వరకూ, ఇంగ్లాండ్‌లో క్రీ.శ. 1752 వరకూ "మార్చి 25వ తేదీతో" సంవత్సరం ఆరంభమయ్యేది. అయితే కాలగమనంలో ఎప్పుడు మారిందో గాని, వారి సంవత్సరారంభం "ఏప్రిల్ నెలకు" మారింది. ఏప్రిల్ నుండి మార్చి వరకూ సంవత్సరాన్ని లెక్కించుకోసాగారు. ఇందుకు కారణమైన చారిత్రక ఆధారమేదీ కన్పించడం లేదు మనకు. బహుశా మన దేశాన అమలులో ఉన్న సంవత్సరాదుల ప్రభావం వారిపై పడి ఉండొచ్చు. సంవత్సరారంభాన్ని "మార్చిలో ఉంచాలా? ఏప్రిల్‌లో ఉంచాలా?' అనేది వారికి కొంతకాలం సమస్య అయింది. సంవత్సరారంభం అనేది ఎప్పుడూ ఒకే నెలలో ఒకే తేదీన వస్తే బావుంటుందని హెచ్చుమంది పాశ్చాత్యులు భావించసాగారు. ఖగోళ గతులను బట్టి చూస్తే సంవత్సరారంభం ఆవిధంగా రాదు మరి! ఆ పరిస్థితుల్లో క్రీ.శ. 15వ శతాబ్ది చివరికాలాన ఫ్రాన్స్‌దేశ చక్రవర్తి ఛార్లెస్" అంతవరకూ సంవత్సరంలో 11వ నెలగా ఉన్న 'జనవరి' ని 1వ నెలగా లెక్కించే విధంగా" నూతన సంవత్సరారంభాన్ని నెలకొల్పాడు. ఈ విధంగా "జనవరి 1వ తేదీ" పాశ్చాత్య సంవత్సరాది అయింది. 12వ నెలగా ఉండే ఫిబ్రవరిని 2వ నెలగా మార్చటం జరిగింది. శాస్త్రీయంగా ఏ ఆధారమూ లేకుండా తమకు నచ్చినట్లు వ్యవహరించడం ఆనాటి పాశ్చాత్యులకు అలవాటే కదా! అధికారం, నోటిబలం గలవాడు ఏదో ఒకటి నిర్ణయించడం, కాలక్రమేణా అది అమలులోకి వచ్చేయడం ఆనాడు మామూలే! జనవరి 1వ తేదీ సంవత్సరాదిగా రావడంలో కూడా అలాగే జరిగింది. సంవత్సరాది అనేది ఎప్పుడూ ఒకే నెలలో ఒకే తేదీన రావాలనే పాశ్చాత్యుల కోరిక, ఆవిధంగా నెరవేరింది. జూలియన్ క్యాలెండరును జనవరితో ఆరంభించడం మొదలయింది. క్రీ.శ. 1582 లో పోప్ గ్రిగరీ చేయించిన సంస్కరణలతో ఆ క్యాలెండరు "గ్రిగోరియన్ క్యాలెండరు" గా మారి, క్రమేణా ఒక్కొక్క దేశం ఆమోదాన్నీ పొందుతూ, నేడు ప్రపంచ ఉమ్మడి క్యాలెండరుగా స్థిరపడింది.

"జనవరి 1వ తేదీ" సంవత్సరారంభంగా రావడం వెనుక ఉన్న విషయాల్లో కొన్ని విశేషాలివి.



## ★ "ఏప్రిల్ ఫూల్ ఆచారం ఎలా వచ్చింది? ★

ఏ ఖగోళ ప్రత్యేకతా లేని జనవరి 1 తో సంవత్సరారంభం చేయడాన్ని విజ్ఞులైన పాశ్చాత్యులు కొంతమంది వ్యతిరేకించారట. వారంతా కూడా అంతకు ముందున్న విధంగానే సంవత్సరారంభాన్ని ఏప్రిల్‌లోనే పాటించేవారట.

"క్రొత్త ఒక వింత, పాత ఒక రోత" అన్నారు కదా! ఆ ప్రకారంగా జనవరితో మొదలయ్యే సంవత్సరాన్ని సమర్థించేవారు అసంఖ్యాకంగా పెరిగారు. వారంతా కలిసి ఏప్రిల్‌లో సంవత్సరారంభం చేసుకునే వారిని హేళన చేస్తుండేవారట. "ఇంకా పాత పద్ధతిలో ఏప్రిల్‌ని పట్టుకుని వ్రేలాడుతున్న మూర్ఖులు వీళ్ళు, వీళ్ళంతా "ఏప్రిల్ ఫూల్స్" (ఏప్రిల్ మూర్ఖులు) అని వెక్కిరించేవారట. ఏప్రిల్‌లో సంవత్సరాది చేసుకునే వారిపై వేళాకోళంగా రంగులు చల్లడం. బహుమతులేవీ లేని ఖాళీపెట్టెల్నీ, గడ్డీ చెత్తాచెదారం నింపి అట్టపెట్టెల్నీ ప్యాక్ చేసి "పండుగ బహుమతులు" గా అందించడం జరిగేదట. ఈ విధంగా మొదలయిన "ఏప్రిల్ ఫూల్ (APRIL FOOL) ఆచారం, నేడు ప్రపంచవ్యాప్తమయింది.

ఏప్రిల్‌లో సంవత్సరాది పాటించేవారిని ఏదొక విధంగా ఫూల్ చెయ్యాలనే భావనతో, ఆనాడు విదేశాల్లో "ఏప్రిల్ ఫూల్ ఆచారం" మొదలయింది. అయితే ఈనాడు దాని అంతరార్థమేమీ తెలియకుండానే మనదేశంలో కూడా ఈ ఆచారం అయోమయ రీతుల్లో కొనసాగుతోంది.

### జనవరి ఫూల్స్ :

కాలమానం అనేది ఖచ్చితంగా ఖగోళశాస్త్ర ఆధారంతో ఉండాలనేది జగమెరిగిన సత్యం! అలాంటప్పుడు సంవత్సర ఆరంభానికి ఒక ఖగోళ ప్రత్యేకత ఉండితీరాలి. జనవరి 1వ తేదీకి ఏవిధమైన ఖగోళ ప్రత్యేకత గానీ, మరో శాస్త్రీయ ఆధారంగానీ లేదు. శాస్త్రీయతను వదిలిపెట్టి, నచ్చినవిధంగా నిశ్చయించుకున్న తేదీ అది!

ఏ శాస్త్రీయ ఆధారమూ లేకుండా జనవరి 1వ తేదీన సంవత్సరారంభం చేసుకునే వారిని "జనవరి ఫూల్స్" అనవచ్చు నిజానికి !



## ★ మన విజ్ఞత ఏమయింది? ★

పాశ్చాత్యుల సంగతి సరేసరి! గొఱ్ఱెమందలా మనవాళ్ళు కూడా "జనవరి ఫస్ట్, ఏప్రిల్ ఫూల్" ఆచారాల్ని "విపరీత ధోరణి" లో అనుసరించడమే శోచనీయం. ***(ప్రపంచ రీతి కోసం జనవరి ఫస్ట్ విధానాన్ని కూడా తీసుకుందాం. పొరపాటు లేదు. మన సంస్కృతి, విజ్ఞానాల్ని మొత్తానికి మరచిపోతున్నామనేదే బాధ! ఆ విషయం గురించి ఆలోచించండి.)*** ఖగోళ పరంగా యథార్థ సంవత్సరాది మనది. ఆ విషయాన్ని మరచిపోయి, విదేశీ సంవత్సరాదిని (ఏప్రిల్ ఫూల్ ఆచారాన్ని కూడా) మోజుగా స్వీకరిస్తూ - తప్ప త్రాగి కేరింతలు కొడుతూ, వెర్రి ఆనందం పొందడంలోని ఏం విజ్ఞత ఉన్నదో యోచించండి.



## ★ ఇంతవరకూ తెలుసుకున్నదేమిటి? ★

ఇంతవరకూ మనం అనేక యథార్థ విషయాల్ని తెలుసుకున్నాం. క్లుప్తంగా వాటిని ఒకసారి మననం చేసుకుందాం.

1. సృష్టిలో అతి ప్రాచీన జాతి "హిందూ జాతి".
2. ప్రాచీన కాలంలో వివిధ రకాల శాస్త్రీయ విజ్ఞానాల్ని హిందువుల నుండే విదేశీ జాతులు నేర్చుకున్నాయి.
3. కాలమానానికి ఖగోళ ఆధారం తప్పని సరి. ఈ విషయాన్ని హిందువులు మాత్రమే పూర్తిగా అవగాహన చేసుకున్నారు. అందువల్లనే వారు కాల మానంలోని ప్రతీ అంశాన్నీ ఖగోళశాస్త్ర ఆధారంతోనే నిర్ణయించారు. విదేశీ జాతులు అలా కాదు. కొన్ని అంశాలకు ఖగోళ ఆధారాల్ని తీసుకోవడం, కొన్నింటికి తమకు నచ్చిన స్వంతదారి అనుసరించడం చేశారు.
4. ఎట్టి ఒడిదుడుకులూ, తికమకలూ లేని పంచాంగం ప్రాచీనకాలం నుండీ హిందువులకు ఉంది.
5. క్యాలెండరు తయారీ కోసం విదేశీ జాతులెన్నో తంటాలు పడ్డాయి.
6. తమ ప్రాచీన శకాల లెక్క ఉన్నా సరే, హిందువులు ప్రపంచ రీతి కోసం అసంబద్ధమైన క్రీస్తుశకాన్ని ఉపయోగిస్తున్నారు.

7. నిర్దిష్టమైన పంచాంగం కలిగిన హిందువులు, ప్రపంచ రీతి కోసం గ్రిగోరియన్ క్యాలెండరును కూడా అనుసరిస్తున్నారు.

8. ఖగోళ ప్రాముఖ్యత కల్గిన వసంత ఋతుకాలంలో సంవత్సరారంభాన్ని గుర్తించారు హిందువులు. ఏ ఖగోళ ప్రత్యేకతా లేని ఒక మామూలు తేదీతో సంవత్సరారంభాన్ని చేసుకున్నారు విదేశీయులు.

9. విదేశీయుల దోపిడీల వల్లా, దౌర్జన్యాల వల్లా, ఆక్రమణల వల్లా స్వదేశ సంస్కృతీ ప్రాభవానికి హిందువులు దూరమయ్యారు.

10. "విదేశీయులు మనకంటే అన్నింటా మిన్న అనీ, శాస్త్రీయ విజ్ఞానమంతా వారి చలువేననీ" హెచ్చుమంది భారతీయులు నేడు అపోహ పడుతున్నారు.

(నిజానిజాలు తెలిసి, ఇటువంటి అపోహ తొలగిపోవాలి. అందుకే మ్రోగిస్తున్నాం "భారతీయ శంఖారావాన్ని!!)



## ★ విశ్లేషణ ★

హిందూ సంస్కృతిలోని ఔన్నత్యం ఏమిటో, విదేశీ సంస్కృతిలోని విచ్చలవిడితనం ఎటువంటిదో మచ్చుకోసం పరిశీలించి చూద్దాం.

ఆంగ్ల సంవత్సరాదినీ, మన సంవత్సరాది అయిన ఉగాది పండుగనూ తీసుకుని, వాటి నిర్వహణా పద్ధతుల్ని విశ్లేషిద్దాం. తద్వారా ఎవరి సంస్కృతి ఎటువంటిదో తెలిసివస్తుంది.

"క్రొత్త సంవత్సరం" పేరు వినగానే నేటి యువత మదిలో మెదిలేది "జనవరి 1వ తేదీ". మనదైన యథార్థ సంవత్సరాది "ఉగాది పండుగ" మాత్రం వారికి గుర్తుకు రాదు. ఉగాది అనేది శాస్త్రీయబద్ధమైన సాంప్రదాయపు పండుగ. మరి జనవరి 1వ తేదీ... కేరింతలతో తప్పత్రాగి కుప్పిగంతులు వేసే పాశ్చాత్య దుష్ట ఆచారాన్ని పెంపొందిస్తున్న రోజు! నేటి యువతరాన్ని ఆకర్షించేది ఇదే మరి.



## ★ మన సమాజంలో ఆంగ్ల సంవత్సరాది ఆచరణ ★

కాలమానానికి ఖగోళ ఆధారం తప్పనిసరి అని చెప్పుకున్నాం. అయితే ఖగోళ ఆధారమేదీ లేకుండా జనవరి 1వ తేదీ సంవత్సరారంభంగా ఎటువంటి అయోమయ పరిస్థితుల్లో నిర్ణయించబడిందో ఇంతకు ముందే తెలుసుకున్నాం. ఆ విషయాలపై సరైన అవగాహన లేని మనవాళ్ళు, జనవరి ఫస్ట్‌కు చేసే ఆర్భాటం అంతా ఇంతా కాదు. విదేశీయులకెంతో తెలుసుననే భ్రమ వారిది. ఈ భ్రమతోనే విదేశీ అనుకరణ పరిపాటి అయింది. మన సమాజంలోని పసిబిడ్డలు కూడా ఈ న్యూఇయర్ పేరిట విదేశీ అలవాట్లకు లోనౌతూ, స్వసంస్కృతి విషయాలు తెలియని విధంగా తయారవుతున్నారు. సుమారుగా డిసెంబరు 15వ తేదీ నుండి గ్రీటింగ్స్ హడావుడి మొదలవుతుంది. ఎంత ఖరీదైన గ్రీటింగ్స్, పుష్పగుచ్ఛాలూ అందిస్తే, అంత గొప్పగా భావించుకుంటారు. అలాంటివేవీ తీసుకురాకుండా వచ్చినవాణ్ణి శత్రువులా చూడడం అలవాటయిపోతుంది మన సమాజంలో ! శుభాకాంక్షలు తెలిపే హృదయ స్వచ్ఛతకు తావు లేదా సమయంలో ! పై పై ఆర్భాటాలదే పై చేయి.

జనవరి 1వ తేదీ వస్తుందనగా డిసెంబరు 31వ తేదీ రాత్రి క్లబ్బుల్లోనూ, హోటల్స్‌లోనూ, ఇళ్ళలోనూ, తోటల్లోనూ, రోడ్లమీదా .... స్త్రీ పురుష వయో భేదాలు లేకుండా గుంపులు గుంపులుగా జనం చేరుతుంటారు. ఇందులో యువతీ యువకులెక్కువగా ఉంటారు. పాశ్చాత్య సంగీతాల హోరులో జోరులో కేరింతలతో చిందులేస్తూ అల్లరి చేస్తూ కాలం గడుపుతారు. కొందరు పేకాట వంటి జూదాలు ఆడితే, మరికొందరు మత్తుపదార్థాలు సేవిస్తారు. ఇలా వివిధ రకాలైన దురభ్యాసాలతో అసభ్యరీతుల్లో ప్రవర్తిస్తుంటారు. రోడ్లపై పరుగులూ, అరుపులూ, గోల, కేకలు ..... నచ్చిన చోటల్లా గోడలపై, రోడ్లపై పెద్ద పెద్ద అక్షరాలతో క్రొత్త సంవత్సరానికి ఆహ్వాన వాక్యాలు వ్రాయడం .... ఇవన్నీ ఉంటాయి. ఆంగ్ల సంవత్సరాది పేరిట డిసెంబరు 31వ తేదీ రాత్రి సమయమంతా వివిధరకాల టెలివిజన్ ప్రోగ్రామ్స్ ఈ విచ్చలవిడితనానికి ఆజ్యం పోస్తున్నాయి. ఆ రాత్రి అంతా టెలివిజన్స్‌లో వస్తున్న విదేశీ సంగీత నృత్యాలతో రెచ్చిపోతుంది మన యువతరం. ఈవిధంగా అర్ధరాత్రి 12 గంటల వరకూ ఖుషీ చేసి, గడియారం 12 గంటలు కొట్టగానే "హేపీ న్యూ ఇయర్" అంటూ దిక్కులు పిక్కటిల్లేలా అరిచేస్తూ పిచ్చెక్కినట్టు ఊగిపోతూ, మరీ

రెచ్చిపోతారు. షాంపైన్ బాటిల్స్ ఓపెన్ చేస్తూ ఆ నురగల్లో ఉబ్బితబ్బిబ్బై పోతారు. జనవరి 1వతేదీ నూతన సంవత్సర పైశాచిక ఆనందం ఇది! అందరూ ఇదేవిధంగా జరుపుకుంటారని మేము చెప్పడం లేదు. నవ నాగరికత ముదిరిన చోట జరుగుతున్న పద్ధతి ఇది. ఈ దురాచారం మెల్లగా పల్లెపల్లెకూ ప్రాకుతూ వస్తోంది. తస్మాత్ జాగ్రత్త!

డిసెంబరు 31 రాత్రి 12 గంటలు కొట్టగానే పరిచయస్థుల ఇళ్ళ తలుపులు తట్టి, గ్రీటింగ్స్ అందిస్తూ వెళ్తారు కొంతమంది. వెర్రి వేయివిధాలు అన్నారు కదా!

మరునాటి ఉదయం చక్కగా ముస్తాబై పళ్ళు, పుష్పగుచ్ఛాలు, కేకులు, గ్రీటింగ్ కార్డులతో అధికారుల వద్దకూ, బంధుమిత్రుల వద్దకూ వెళ్లి "నూతన సంవత్సర శుభాకాంక్షల్ని" తెలియపరుస్తుంటారు. ఎందుకో ఏమిటో సరిగా తెలియకుండానే ఎంతోమంది వేలంవెర్రిగా జనవరి ఫస్టన ఈ తతంగాన్ని విధిగా అనుసరిస్తున్నారు. ఇది ఒక ఫ్యాషన్ కార్యక్రమంగా మారింది. "అందరూ చేస్తున్నారు, మనమూ చేయకపోతే ఎలా?" అనుకుంటూ గొర్రెమందలా అనుసరిస్తున్నారు.

ఈ జనవరి 1వ తేదీనాటి ఆచరణలో ముఖ్యంగా ఈ క్రింది ఫలితాలు కలుగుతాయి.

**(1)** తర్వాత ఫలితాలు ఎలా ఉన్నా తక్షణ ఆనందం లభిస్తుంది. **(2)** లోపల సంగతి ఎలా ఉన్నా, పైకి మాత్రం పరస్పర అభినందనల వాతా వరణం కనిపిస్తుంది. **(3)** పాశ్చాత్య వ్యామోహంతో దురలవాట్లు పెరుగుతాయి. **(4)** స్వసంస్కృతిని అర్థం చేసుకోగల విజ్ఞతను క్రమంగా కోల్పోతారు.



## ★ హిందూ సంవత్సరాది ఆచరణ ★

హిందూ సంవత్సరాది ఆచరణను తెలుసుకోవడమంటే - మన "ఉగాది పండుగ" గురించి చెప్పుకుంటే సరిపోతుంది.

సూర్యోదయంతో మన పండుగరోజు మొదలవుతుంది. కనుక డిసెంబరు 31 అర్థరాత్రి పిచ్చిచేష్టలకు తావులేదు. చక్కగా తెల్లవారుఝామునే లేచి కాలకృత్యాలు తీర్చుకుని, తలస్నానం చేసి, దైవధ్యానం చేసుకుంటారు. హోదాను బట్టి నూతనవస్త్రాల్ని ధరిస్తారు. పండుగకు బంధుమిత్రులు ...

ముఖ్యంగా కూతుళ్ళు, అల్లుళ్ళు రావడం జరుగుతుంది. పరగడుపున వేపపువ్వు పచ్చడిని సేవిస్తారు. పొరుగు వాళ్ళందరికీ ఆ పచ్చడిని పంచుతారు. క్రొత్త సంవత్సరం "సర్వేజనా సుఖినో భవంతు" గా ఉండాలని కోరుకుంటారు. శుభాకాంక్షలు తెలుపు కుంటారు. ప్రతీ గృహంలోనూ సుఖసంతోషాలతో సంప్రదాయ సిద్ధమైన విందు భోజనాలు ఆరగిస్తారు.

ఆరోజు సాయంకాల సమయంలో అందరూ దేవాలయం వద్దనో, రచ్చ బండ వద్దనో చేరి పరస్పర శుభాకాంక్షలు చెప్పుకుంటారు. కవితా ప్రసంగాలు జరుగుతాయి. పురాణ శ్రవణాలుంటాయి. చివరిగా పంచాంగ శ్రవణంతో కార్యక్రమం ముగుస్తుంది.

ఉగాది ఆచరణలో ఖగోళవిజ్ఞత, నియమబద్ధత, ఆరోగ్యపుష్ఠి, ఆధ్యాత్మిక దృష్టి మొదలైన ఉత్తమ లక్షణాలెన్నో కన్పిస్తాయి. ఇందులో తప్ప త్రాగడం, తూలడం, ప్రేలడం, విచ్చలవిడిగా వావివరుసలు లేకుండా గెంతడం ..... ఇలాంటి దౌర్భాగ్యాలుండవు. సంప్రదాయసిద్ధమైన బంధుమిత్ర సమాగమం, ప్రజా కలయికలుంటాయి. ఆత్మీయతను పెంచే కుటుంబ సంతోషం కన్పిస్తుంది. వేకువఝామునే నిద్రలేవడం, తలస్నానం, నూతన వస్త్రధారణ, దైవధ్యానం .... ఇవన్నీ ఆరోగ్యకరమైన అలవాట్లే !

**ఉగాది పచ్చడి విశిష్టత**

వేపపువ్వు, కొత్తబెల్లం, చింతపండు, శనగపప్పు, అరటిపళ్ళు, మామిడి ముక్కలు, కొబ్బరిముక్కలు, చెఱకు ముక్కలు మొదలైనవాటితో ఉగాదిపచ్చడి తయారుచేస్తారు. కడుపులోని రోగక్రిములను నశింపజేయగల శక్తి ఈ పచ్చడికి ఉంది. పరగడుపున ఈ పచ్చడి ఆరగించడం, ఒక చక్కని 'ఔషధ సేవ" అని గ్రహించండి. ఈ పచ్చడి జీర్ణశక్తిని పెంపొందిస్తుంది. వాత, పిత్త, శ్లేష్మాలను సమపాళ్ళలో ఉంచుతుంది. చేదు, తీపి, పులుపు, వగరు మొదలైన అనేక రుచులతో నోరూరించే ఈ పచ్చడి - 'జీవితంలో మనం అనుభవించే కష్ట సుఖాలకూ, లాభనష్టాలకూ ప్రతీక' అని మన పెద్దలు చెప్తుంటారు.

ఉగాది పండుగ వచ్చే కాలంలో వాతావరణాన వైరస్ క్రిముల వ్యాప్తి హెచ్చుగా ఉంటుంది. వైరస్‌ను చంపే మందు ఈ నాటికీ కనుగొనబడలేదు. వైరస్‌ను నిరోధించే టీకాలు మాత్రం ఉన్నాయి. ఈ టీకాలు లేని రోజుల్లో

వైరస్ నిరోధానికి మన పూర్వీకులు "వేప" నే వాడేవారు. వేపగాలి కూడా వైరస్ నిరోధానికి ఉపకరిస్తుంది. (ఇంటింటికీ వేపమండలతో జాతరగా తిరగడం అనే ఆచారం, వైరస్ నిరోధానికే అని గమనించండి.) వేపపూత క్రిమిసంహారిణి. అందుకే ఉగాదినాడు వేపపువ్వు పచ్చడి తింటారు. "వేప" చర్మ రోగాలను కూడా నయం చేస్తుంది.

క్రొత్త సంవత్సరం శుభాకాంక్షలు తెలుపుకునే ఆచారం మన ఉగాదిలోనూ ఉంది. కవితా ప్రసంగాలు మన మేధస్సును పెంచుతాయి. పురాణశ్రవణం ఆధ్యాత్మికతనూ, భక్తినీ, మనోనిశ్చలతనూ, ధైర్యాన్నీ కల్గిస్తుంది. ఇక పంచాంగ శ్రవణం సంగతి! ముఖ్యంగా నేటి యువతరానికి "ఈ పంచాంగ శ్రవణం అంటే లోకువ, పురాణశ్రవణం అంటే విసుగు", వారి దృష్టిలో పంచాంగాలూ, పురాణాలూ అంటే కేవలం ఛాదస్తం, మూర్ఖత్వం! వాటి ఔన్నత్యం తెలియదు వారికి. (పురాణాల్లోని విజ్ఞాన విషయాల్ని తెలుసుకోడానికి మా "పురాణాల్లో సైన్స్" గ్రంథాన్ని చదవండి. పంచాంగం ప్రాముఖ్యతను ఈ క్రింద వివరిస్తున్నాం చూడండి.)

## పంచాంగంలో ఏముంటాయి?

పంచాంగం అనేది జాతకాలూ, మంచిచెడ్డలు చూసుకోడానికే పరిమిత మైనదిగా చాలామంది భావిస్తుంటారు. తిథి, వారం, నక్షత్రం, యోగం, కరణం అనే ఖగోళ అంశాలతో పంచాంగం తయారైందని వారికి తెలియదు. (పంచాంగంలోని "పంచ అంగాల వివరణ" ఈ పుస్తకంలో ఇంతకు ముందే తెలుసుకున్నాం.) ఎన్నో విధాల చక్కని ఖగోళ పరిజ్ఞానాన్ని కల్గిస్తుంది. మన పంచాంగం. సూర్య చంద్ర గమనాలు .... వాటి కొచ్చే గ్రహణాలు ........ ఆ గ్రహణాలు ఎప్పుడొచ్చేదీ, ఎంతసేపు ఉండేదీ ...... ఇంకా నవగ్రహాల నడకలు, అవి ఏ కాలంలో ఏ నక్షత్ర రాశిలో ఎంతకాలం ఉండేదీ ...... సూర్యుని ఉదయాస్తమయ వేళలు ...... మాసారంభం, మాసంపాడవు, మాసం ముగింపు, గురు గ్రహచారం, పుష్కరాల విశేషాలు, పండుగలు, అయనాలు, ఋతువులు, గ్రహమౌఢ్యకాలాలు, జ్యోతిష విశేషాలూ .... ఇవన్నీ పంచాంగం తెలిపే అంశాలే ! **ఇన్నిరకాల శాస్త్రీయ అంశాలు మిళితమై ఉన్న పంచాంగం - "అర్థం చేసుకో గలిగితే విజ్ఞానం, అర్థంకాని వారిదొక అజ్ఞానం!"**



## ★ జ్యోతిషం అనేది నిజమా ? కాదా? ★

మన జీవితగమనాన్ని తెలిపేది జాతకం. జాతకాల్ని వివరించి చెప్పే శాస్త్రం "జ్యోతిషశాస్త్రం". ఆకాశంలోని గ్రహతారకల నడకల ఆధారంగా జాతకాలు వ్రాయబడతాయి. (అనేక రకాల జ్యోతిషాల్లో ఈ రకం ఒకటి!) "ఎక్కడో ఉండే గ్రహ నక్షత్రాలకూ, మన జీవితాలకూ సంబంధం ఏమిటి? అంతా భ్రమ!" అంటూ ఈ రకమైన జ్యోతిషాన్ని కొట్టిపారేస్తారు కొందరు. పంచాంగం అంటే లోకువ భావం ఏర్పడడానికి ఇదో కారణం. అయితే అటువంటివారికి మాదొక మనవి. జ్యోతిషశాస్త్రం ఖగోళానికి సంబంధించినది. ఖగోళమంతా ఒకే "బ్రహ్మ పదార్థం!" ఒకే పదార్థంలోని అంశాలు ఒకదానిపై ఒకటి ప్రభావాన్ని కలిగి ఉంటాయి. ఇది మరువకూడని సత్యం. అనంతమైన ఈ ఖగోళంలో మన "భూగోళమే" కాదు, దానిమీద ఉన్న జీవులు కూడా ఖగోళానికి చెందిన అంశీ భూతాలే! అటువంటప్పుడు జీవులపై గ్రహతారకల ప్రభావం ఉండదని ఎలా చెప్పగలం? ఖగోళ శాస్త్రవిజ్ఞానం అంతులేనిది. అందులో ఇప్పటికి మనం తెలుసుకున్నదెంత? ...... చాలా తక్కువ, మనం తెలుసుకోలేనిదాన్ని గురించి "అది లేదని గానీ, తప్పు అని గానీ" చెప్పే అధికారం మనకు లేదు.

అంతరిక్షంలోని నక్షత్రాలూ, గ్రహాలూ అన్నీ ఒకదానిపై ఒకటి తమ ప్రభావాన్ని చూపిస్తూ ఉన్నవే! అమావాస్య, పౌర్ణమి దినాల్లో చంద్రుని కారణంగా మన భూమిపై ఉన్న సముద్రాలకు ఆటు పోట్లు రావడం మనకు తెలుసు కదా! ఇంకో చిత్రమైన సంగతి చూడండి. మతిస్థిమితం లేని పిచ్చివారిని పరిశీలించి చూడండి. అమావాస్య, పౌర్ణమి దినాల్లో వారి పిచ్చితనంలో తేడా కన్పిస్తుంది. వారి మనసులపై చంద్రుడనే ఉపగ్రహం కల్గిస్తున్న ప్రభావం అది! గ్రహతారకల ప్రభావం జీవులపై ఉండదని మనం చెప్పలేం. సూర్యగోళంపై అప్పుడప్పుడూ 'నల్లని మచ్చలు' విపరీతంగా కన్పించడం ఖగోళ శాస్త్రవేత్తలకు తెలుసు. అలా ఎక్కువగా నల్లనిమచ్చలు కన్పించినప్పుడు భూగోళంపై మనుషుల్లో క్రూరత్వం, అసూయాద్వేషాలు విజృంభించి - అనేక మారణకాండలూ, దౌర్జన్యాలూ, యుద్ధాలూ హెచ్చుగా సంభవిస్తున్నాయని ప్రపంచంలో అనేకమంది ఖగోళ శాస్త్రవేత్తలు చెప్తున్నారు. జీవుల మానసిక ప్రవర్తనపై గ్రహతారకల ప్రభావం

ఉంటుందనడానికి ఇలా నిదర్శనాలున్నాయి. కాబట్టి ఎవరూ కూడా ఒక్క మాటలో జ్యోతిషాన్ని కొట్టిపారేసే వీలులేదు. జన్మించిన సమయాన్ని బట్టి ఆ జీవిపై ఆయా గ్రహతారకల ప్రభావాలు వేర్వేరుగా ఉంటాయని జ్యోతిషశాస్త్రం సూచిస్తోంది.

సూర్యకుటుంబంలోని గ్రహాలు, 12 నక్షత్రరాశుల మీదుగా సంచారం చేస్తుంటాయి. అందువల్లనే ఆ నక్షత్రరాశులను బట్టి, భూమిపై ఉన్న మనకు జ్యోతిషాలు గణించబడతాయి. రాశిచక్రాన్ని "జ్యోతిషచక్రం" అంటారందుకే.

అతిప్రాచీన కాలంలోనే అత్యద్భుత ఖగోళ రహస్యాల్ని కనుగొన్న ఉద్దండ పండితులు ప్రాచీన హిందువులు. అలనాటి వారి ఖగోళ సిద్ధాంతాలు, నేడు నిరూపణ అవుతున్నాయి కూడా! అటువంటి పండితులు రూపొందించిన జ్యోతిషశాస్త్రాన్ని కాదనడానికి మనమెంతవాళ్ళం?



## ★ ఉగాది నుండి జాతకాలు మారుతాయా? ★

'కాలమానం' అనేది ఖగోళ శాస్త్ర ఆధారమైనది. 'సంవత్సరం' అనేది కాల మానంలోని ఒక అంశం. అందువల్ల సంవత్సర సంవత్సరానికీ ఖగోళ పరిస్థితుల్లో వచ్చే మార్పుల ప్రభావం మన జీవితాలపై పడుతుంది. (జీవులు, ఖగోళ అంశీభూతాలేననే విషయాన్ని మనం మరువకూడదు.) దీని ప్రకారం సంవత్సర సంవత్సరానికీ మన జాతకాలు మారుతాయని తెలుస్తోంది. అందుకే క్రొత్త సంవత్సరంలోని క్రొత్త జాతకం కోసం మనం ఎదురు చూస్తుంటాం.



## ★ నూతన సంవత్సర శుభాకాంక్షలు చెప్పుకోవలసింది ఎప్పుడు? ★

ఖగోళపరమైన మార్పు కారణంగా ఉగాది నుండి మొదలయ్యే కొత్త సంవత్సరంలో మన జాతకాలు మారే అవకాశాలున్నాయి. అందువల్ల ఒకరి కొకరు "నూతన సంవత్సర శుభాకాంక్షల్ని" తెలుపుకుంటూ, ప్రారంభమయ్యే క్రొత్త సంవత్సరాన శుభం కలగాలని ఆశించడంలో ఒక పరమార్థం ఉంది. అదే

జనవరి ఫస్ట్‌ని చూడండి. ఖగోళ ఆధారం లేని కాలమానం అది! డిసెంబరు **31**వ తేదీ అర్ధరాత్రి సమయాన గడియారం **12** గంటలు కొడితే మాత్రం ఏమయింది? కాలగమనంలో ఖగోళ మార్పుగానీ, ఖగోళ ప్రత్యేకత గానీ ఏదీ లేదు .... రాదు. దీన్ని బట్టి మన జాతక విధానంలో కూడా అంతగా మార్పేమీ ఉండబోదు. అలాంటప్పుడు జనవరి ఫస్ట్‌న "విష్ యూ హేపీ న్యూ ఇయర్" అని చెప్పుకోవడంలో "ఉగాదికి ఉన్న విశిష్టత" కన్పించదు.

జాతక మార్పుకు అవకాశం గల సమయం కనుక, ఉగాదినాడు నూతన సంవత్సర శుభాకాంక్షల్ని తెలుపుకోవడం సందర్భోచితమని గ్రహించండి.



**ఆంగ్ల సంవత్సరాది ఆచరణ, మన ఉగాది ఆచరణల గురించి వివరంగా తెలుసుకున్నాం. ఏది శాస్త్రీయ సంవత్సరారంభమో మీరే ఆలోచించండి ఈసారి.**



## ★ మన దేశాన సామాన్యుడు కూడా పండితుడే! ★

పాశ్చాత్య దేశాల్లో విజ్ఞానం ఎంతగా వెల్లివిరిసినా, అది కేవలం మేధావి వర్గాలకే పరిమితం. సామాన్యులందరికీ ఆ విజ్ఞానం అందదు.

హిందూ ఋషీశ్వరులు మాత్రం తాము కనుగొన్న విజ్ఞాన విషయాలన్నీ అతి సామాన్యులకు కూడా అందే విధంగా, అనేక విజ్ఞానాంశాల్ని నిత్యజీవన విధానాలతో ముడివేశారు. "తిథి, వారం, నక్షత్రం, మాసం, కార్తెలు, ఋతువులు, అయనాలు, సంవత్సరాలు, పుష్కరాలు, గ్రహణాచారం, మౌఢ్యకాలం ముహూర్తాలూ...." అంటూ ప్రతివారికీ ఖగోళ విజ్ఞానం అందే విధంగా ఋషీశ్వరులు ఏర్పాటు చేశారు. అందుకే పూర్వకాలాన ప్రజలు ఆకాశంలోని నక్షత్రాలను చూసి టైము ఎంతయిందో చెప్పగలిగేవారు. మరి కాస్త తెలివైన వారయితే గ్రహగతులనూ, చంద్రకళలనూ చెప్పగలిగేవారు. పండితులు, కవులు తమ రచనల్లో ఖగోళ అంశాల్ని ఇరికించేవారు. (మహాభారతంలో అనేక చోట్ల ఆనాటి ఖగోళ స్థితి గతుల్ని వేదవ్యాస మహర్షి వివరించబట్టే, నేడు మహా భారత కాల నిర్ణయాన్ని చేసుకోగలుగుతున్నాం!

ఖగోళ శాస్త్ర పండితులంటే సామాన్య ప్రజానీకానికి పూజ్యభావం ఉండేది ఆనాడు. మతం వేరు, విజ్ఞానం వేరుగా కాకుండా రెండూ కలసి ఉండి శాస్త్రీయమైన ధర్మప్రవర్తనకు దారిచూపేవి.

ఇక విదేశీయుల సంగతి! వీళ్ళు కళ్లు తెరిచి విజ్ఞానం నేర్చింది ఆధునిక కాలంలో ! క్రొత్తలో యథార్థ శాస్త్రీయ అంశాల్ని చెప్పిన శాస్త్రవేత్తల్ని అక్కడి మతాధికారులూ, సామాన్య ప్రజలూ కలిసి హింసించి చంపేసేవారు. సజీవంగా దహనం చేసేవారు. గెలీలియో మొదలైన విదేశీ శాస్త్రవేత్తలకు ఎటువంటి గతి పట్టిందో మనకు తెలియనిది కాదు. విదేశీ చక్రవర్తులు తమ మూర్ఖత్వంతో ఎందరో శాస్త్రజ్ఞుల తలల్ని నరికించిన సంఘటనలు ప్రపంచ చరిత్రలో ఉన్నాయి. శాస్త్రీయ యథార్థాలకు పూర్వకాలాన విదేశీయులిచ్చిన గౌరవం అలా ఉండేది. సామాన్య ప్రజలకు విజ్ఞాన విషయాలు తలకెక్కకపోవడమే దానికి ముఖ్య కారణం. ఇటువంటి ప్రమాదం రాకుండా ఉండేందుకే మన ఋషీశ్వరులు తాము కనుగొన్న విజ్ఞానాంశాల్ని "ఆచారాలుగా, దినసరి కార్యక్రమాలుగా" నిత్య జీవితంతో కలబోసి సామాన్యులకు అందించారు. (ఈ కార్యం మొన్నటివరకూ సత్ఫలితాలనే ఇచ్చింది. నేటితరం మాత్రం మన ఆచారాల్లోని అంతరార్థాల్ని తెలుసుకోలేక, మూర్ఖత్వానికి బలి అవుతోంది. ఎవరో వచ్చి మనల్ని సంస్కరించరు. మన ప్రాచీనుల విజ్ఞతను అర్థం చేసుకోవడం ద్వారా, మనల్ని మనమే సంస్కరించుకోవాలి. ప్రపంచానికో వెలుగుబాట చూపించవలసిన బాధ్యత భారతీయులకుంది.)

విదేశీయులు మొన్నమొన్నటి వరకూ కూడా శాస్త్రీయతను నమ్మలేని ఛాందసులూ, మూర్ఖులుగా ఉండేవారు. తర్వాత కాలక్రమేణా ఈ ఆధునిక కాలంలో కొంత అభివృద్ధి సాధించి, 'మేమే మేధావులం" అంటున్నారు. అదిచూసి భ్రమ పడుతున్న మన దేశ అమాయకులు 'పాశ్చాత్య సంస్కృతి కోసం' ఎగ బడుతున్నారు. ఇదీ ప్రస్తుత పరిస్థితి!



## ★ మన కర్తవ్యం ★

భారతీయ సోదర సోదరీమణులకు నమస్కారం. ఉమ్మడి కాలమానం కోసం మనమంతా జనవరి ఫస్ట్‌ను ఆంగ్ల సంవత్సరాదిగా గుర్తిద్దాం. అయితే అనవసర హంగూ ఆర్భాటాల, దురభ్యాస్యాల జోలికి మాత్రం పోవద్దు. పాశ్చాత్య వ్యామోహం మనకొద్దు. శాస్త్రీయ సంవత్సరాది అయిన ఉగాది పండుగ అంతరార్థాన్ని గ్రహించి, సంప్రదాయ రీతిలో ఆ పండుగను ఆచరిస్తూ 'స్వసంస్కృతిని" కాపాడుకుందాం. ఉగాది రోజున 'నూతన సంవత్సర శుభాకాంక్షల్ని" తెలుపుకునే సదాచారాన్ని పాటిస్తూ "హైందవ ప్రత్యేకత" ను నిలుపుకుందాం. ప్రపంచంలో అతి ఘనమైన స్థానాన్ని పొందుతున్న మన సంస్కృతీ సంప్రదాయాలను పరిరక్షించుకుంటూ శాస్త్రీయమైన ధర్మపథాన నిజమైన "భారతీయులుగా" ముందుకు పయనిద్దాం.



## ★ కొసమెరుపుతో ముగింపు ★

ప్రభుత్వమూ, పత్రికలూ, విద్యాలయాలూ మొదలైనవేవీ అందించలేక పోతున్న విజ్ఞానాన్ని మనకు మనమే సాధించుకోవాలి. శాస్త్రీయమైన యథార్థాల్ని పరిశోధించి వెలికితియ్యాలి. ఈ శాస్త్రీయ యుగాన పెరుగుతున్న అశాస్త్రీయ ధోరణుల్ని అరికట్టడానికి ఈ కృషి ఎంతోముఖ్యం. భరతమాత ముద్దు బిడ్డలుగా ఇటువంటి కృషిలో మనం ముందడుగు వేద్దాం.

**జైహింద్**



ప్రపంచ పుస్తక చరిత్రలో అద్భుతాలు

# "భారతీయ శంఖారావం ప్రచురణలు"

**మనకు అందకుండా పోతున్న ప్రాచీన భారతీయ**

**విజ్ఞానాన్ని సులభశైలిలో అందిస్తున్నాయి**

**'భారతీయ శంఖారావం ప్రచురణలు'**

**"హిందూ సంస్కృతిని పునరుజ్జీవింపజేస్తున్న**

**ఈ క్రింది పుస్తకాల్ని చదవండి! చదివించండి!!"**

  

**భారతీయ శంఖారావం-1**

## "పురాణాల్లో సైన్స్"

**- పోలిశెట్టి బ్రదర్స్**

★ పురాణాల్లో టెస్ట్ ట్యూబ్ బేబీలు ★ వేదకాలంలో కరెంటు ★ నేటి అణుబాంబుల్ని మించిన అలనాటి అస్త్రాలు ★ బెర్ముడా ట్రయాంగిల్‌ను పోలిన రామాయణకాలపు రాక్షసి ★ అలనాటి కృత్రిమ వర్షాలు ★ రాడార్‌లు – దివ్యదృష్టి ★ అలనాటి ఆకాశ, అంతరిక్ష విహారాలు ★ టి.వి.వంటి చాక్షుసి విద్య.... ఇంకా ఇలాంటి విశేష అంశాలెన్నో ఉన్న పుస్తకం ఇది! రామాయణం, మహాభారతం, భాగవతం, చతుర్వేదాల్లో దాగి ఉన్న ఆధునిక సైన్స్ విషయాలెన్నింటినో తెలుసుకోవచ్చు మీరు.

దేశ, విదేశాల్లోని వివిధ రంగాలకు చెందిన మేధావుల ప్రశంసలందుకుంటూ పునర్ముద్రణలు పొందుతున్న ఈ పుస్తకం, ఇతర భారతీయ భాషల్లోకి అనువదించబడనున్నది.

  

భారతీయ శంఖారావం-2

# "జనవరి ఫస్ట్ Vs.ఉగాది"

**(హైందవ కాలమానం)**

**- పోలిశెట్టి బ్రదర్స్**

★ శాస్త్రీయమైన సంవత్సర ఆరంభం ఏది? (జనవరి 1వ తేదీయా? ఉగాదా?) ★ ఉగాది మరియు పంచాంగాల విశిష్టత ఎటువంటిది? ★ క్యాలెండరు అనేది ఎప్పుడు, ఎలా పుట్టింది? అది ఎన్నెన్ని మార్పులు చెందింది? ★ ఇంగ్లీషు నెలలు, తెలుగు నెలల పేర్లెలా వచ్చాయి? ★తిథుల పేర్లు, వారంలోని ఏడు రోజుల పేర్లెలా వచ్చాయి? ★ లీపు సంవత్సరం ఎందుకు, ఎలా ప్రవేశ పెట్టబడింది? ★ ఏప్రిల్‌ఫూల్ ఆచారం ఎందు కొచ్చింది?... ఇలాంటి ఎన్నో ప్రశ్నలకు జవాబిస్తుంది ఈ పుస్తకం.

విశిష్టమైన స్వదేశీ పరిజ్ఞానాన్ని మరిచిపోతూ, వెర్రిగా పాశ్చాత్య వ్యామోహంతో పరుగులెడుతున్న నేటి తరానికి ఒక మేలుకొలుపు ఈ పుస్తకం.



భారతీయ శంఖారావం-3

# "కృష్ణం వందే జగద్గురుమ్"

**- పోలిశెట్టి బ్రదర్స్**

కృష్ణ పరమాత్మ జీవితంపై కనీవినీ ఎరుగని రీతిలో వెలువడిన అద్భుత విశ్లేషణ ఇది.

**"శ్రీకృష్ణుడంటే తెలుసు అందరికీ!**
**ఆయన చేష్టల అంతరార్థాలు తెలిసింది ఎందరికి?"**

శ్రీ మహావిష్ణువు కృష్ణావతారం దాల్చి, 5 వేల సంవత్సరాలయింది. శ్రీకృష్ణునిపై వేలాది గ్రంథాలు వచ్చాయి. వస్తున్నాయి. అయితే ఇంతవరకూ ఏ గ్రంథమూ కూడా కృష్ణావతార తత్వాన్ని సంపూర్ణంగా వివరించ లేకపోయింది. ఆ లోటును పూరించేందుకే 'నభూతో న భవిష్యతి'గా వచ్చింది "కృష్ణం వందే జగద్గురుమ్".

"ఇది విజ్ఞానుల భక్తికి పై కప్పు. అజ్ఞానులకో కనువిప్పు"



భారతీయ శంఖారావం-4

# "పురాణగాథల్లో సైన్స్ అద్భుతాలు"

- పోలిశెట్టి బ్రదర్స్

మన పురాణాల్లో అనేక కథలు, గాథలు ఉన్నాయి. వాటిలో అనేక సైంటిఫిక్ అంశాలు దాగి వున్నాయి. అటువంటి సైంటిఫిక్ అద్భుతాల్ని సరళమైన తెలుగులో అందించే విజ్ఞాన రసగుళిక ఈ పుస్తకం.



భారతీయ శంఖారావం-5

# "ధర్మసందేహాలు-ధార్మిక సమాధానాలు"

- పోలిశెట్టి బ్రదర్స్

మన వేద, పురాణ, ఇతిహాసాలు మరియు ఇతర సాంస్కృతిక అంశాలు కొన్నింటిపై మనకెన్నో సందేహాలు వస్తుంటాయి. అటువంటి వాటికి అద్భుత సమాధానాలు ఇవ్వబడిన పుస్తకం.



భారతీయ శంఖారావం-6

# "సులభశైలిలో వేద విజ్ఞానం"

- పోలిశెట్టి బ్రదర్స్

"వేదభూమి" అంటూ మన దేశాన్ని పొగుడుకోవడం పరిపాటి. అయితే వేదాలంటే ఏమిటో, వాటిలో ఉన్న విజ్ఞానాంశాలేమిటో చాలా మందికి తెలియవు. ఈ దుస్థితిని తొలగించేందుకు "సులభశైలిలో వేద విజ్ఞానాన్ని" అందిస్తున్నారు పోలిశెట్టి బ్రదర్స్. అనంతమైన విజ్ఞానాన్ని అతి సులభశైలిలో, ఆసక్తికరమైన రీతిలో అందుకోండి. సులువుగా వేదవిజ్ఞానాన్ని పొందండి.



భారతీయ శంఖారావం-7

# "హిందూ పండుగల్లో సైన్స్"

- పోలిశెట్టి బ్రదర్స్

మన హిందూ పండుగల ఆచరణలో ఉన్న సైంటిఫిక్ అంశాల్ని సులభశైలిలో వివరించే గ్రంథం.



ఈ ఏడు పుస్తకాలూ ఆంధ్రప్రదేశ్ అంతటా ప్రముఖ పుస్తకాల షాపుల్లో లభిస్తాయి. డైరెక్టుగా మావద్ద నుండి 7 పుస్తకాల సెట్ తీసుకునే వారికి ధరల్లో తగ్గింపు సదుపాయం కల్పిస్తాం. ఈ క్రింది మొబైల్ నంబరుతో సంప్రదించండి.

మొబైల్ నంబరు:

**9 9 8 9 0 8 9 1 5 6**

మా చిరునామా–

**పోలిశెట్టి బ్రదర్స్,**

**17-3-6, గౌరీకోనేరు వద్ద, పెద్దాపురం-533 437.**

**తూర్పుగోదావరి జిల్లా (ఆంధ్రప్రదేశ్)**

**ఫోన్స్: (08852) 244266, 241495 సెల్: 99890 89156.**

**మీ జీవిత కాలమంతా శ్రమించినా సాధించలేని పరిజ్ఞానాన్ని పోలిశెట్టి బ్రదర్స్ రచనల ద్వారా సులభంగా పొందగలరు.**



**"మానవాళికి అద్భుత వరాలు**

**- పోలిశెట్టి బ్రదర్స్ రచనలు"**



ఓం విఘ్నేశ్వరాయ నమః



ఈ యేటి విజ్ఞాన తరంగం

# "జనవరి ఫస్ట్ Vs ఉగాది"

## (హైందవ కాలమానం)

– పోలిశెట్టి బ్రదర్స్



ఏ జాతి తన పూర్వులను స్మరించదో, ఏ జాతి తన ఉజ్జ్వల గత చరిత్రను విస్మరిస్తుందో - ఆ జాతికి భవిష్యత్తు ఉండదు. ఏ జాతి తన ధర్మసంస్కృతీ పరంపరలను విడనాడుతుందో, ఆ జాతికి మనుగడే లేదు. కనుక ఈ పవిత్ర భారతావనిలో జన్మించిన మహనీయుల సుగుణములను స్మరించుకుంటూ, గత వైభవాన్ని నెమరువేసుకుని స్ఫూర్తిని పొంది ఉత్తేజితులై, నవ భారత నిర్మాణానికి కంకణధారులం కావాలి మనం.

- దేశబంధు చిత్తరంజన్ దాస్.

ప్రచురణ

Since : 1920

**గొల్లపూడి వీరాస్వామి సన్ ®**

**ఆధ్యాత్మిక గ్రంథ ప్రచురణ కర్తలు**

**కోటగుమ్మం - రాజమండ్రి - 1**

వెల : **39-00**